శ్రీరామా!

# విచిత్రవివాహము.



కల్పితకథ.

(శారదచట్టము త్వరలో రానున్నదని జరిగించిన యతిబాల్యవివాహము.)

(హాస్యరసప్రధానము.)

## పానుగంటి లక్ష్మీనరసింహారావుచే

రచియింపఁబడి



మొదటికూర్పు వేయిప్రతులు


శ్రీ విద్వజ్జనమనోరంజనీముద్రాక్షరశాలయందు
ముద్రింపించి ప్రచురింపఁబడెను.
పిఠాపురము.
1930.


 [వెల పదణాలు.

# పీఠిక.



ఇది నాయిరువదియాఱవనాటకము. నన్నుఁ బోషించుచున్న శ్రీపిఠాపురాస్థానమహారాజుగారు దీనిని దయతో నచ్చువేయించినారు. వారికి వారికుటుంబమునకుఁ బరమేశ్వరుఁడు సర్వశ్రేయముల నిచ్చి రక్షించుఁగాక.

దీనికి నాందీప్రస్తావనలను వ్రాసి నాకొసఁగిన నామిత్రరత్న మగు బ్ర॥శ్రీ కూచి నరసింహముగారి కనేకనమస్కారము లర్పించుచున్నాను.

పానుగంటి లక్ష్మీనరసింహారావు.

# ఇందువచ్చుపాత్రములు.



## పురుషులు.

వెంకటరావు—ఒకబ్రాహ్మణుఁడు

పురోహితుఁడు—పెండ్లిచేయించిన బ్రాహ్మణుఁడు

కామరాజు—ఒకసెట్టి

జగ్గయ్య—అతనికొడుకు

అప్పన్న—వెంకటరావు వియ్యంకుఁడు

ధర్మయ్య—అప్పన్నకొడుకు-పెండ్లికొడుకు

చాకలి—కామరాజుభటుఁడు

మంగలి—వివాహములో డోలువాయించినవాఁడు.

భటులు మొదలగువారు.

## స్త్రీలు.

గంగ—వెంకటరావుతల్లి-విధంతువు

సుందరమ్మ—వెంకటరావునక్క—సకేశయగువిధంతువు

కనకమ్మ—వెంకటరావుభార్య

వీరమ్మ—కామరాజుభార్య

సీత—అతనికూఁతురు-బాలవిధంతువు

రంగి—వెంకటరావుదాసి

మహాలక్ష్మి—అప్పన్నభార్య

చలమమ్మ—అప్పన్నపుత్రిక-బాలవిధంతువు

దమయంతి—పెండ్లికూఁతురు



శ్రీరామా!

# విచిత్రవివాహము.

---

## నాంది.

క. ఎంతటివారికిఁ దప్పని
చింతాతిమిరంబు విరియఁ జేసెడికమలా
కాంతకృతహాసచంద్రిక
సంతస మిడుఁగాక యిచటిసభ్యుల కెల్లన్.

సూత్రధారుఁడు—నటీ! యిటొకసారి వచ్చెదవా?

నటి—(ప్రవేశించి) ఏమిసెలవు?

సూ—శ్రీపానుగంటి లక్ష్మీనరసింహారావు కవిగారి యిరుకవియాంకవ రూపక మగు "విచిత్రవివాహము"ను బ్రదర్శించుటకు వీరాం రందఱు సిద్ధముగా నున్నారో లేదో యని యడుగుటకుఁ బిలిచితిని.

న—మీరు చెప్పుటయు మే మట్లు చేయకుండుటయు నెన్నఁడైన జరుగునా?—కాని సర్వసంతోషప్రదాత యగు సర్వేశ్వరుని వినుతింపక, యాయనచే సృజింపఁబడిన వని చెప్పి నవ్వులను, తుమ్ములను, ఆవులింతలను బ్రణుతింపఁ బ్రారంభించి నా రేమి?

సూ—ఇది శిశుపరిణయప్రహసనము, హాస్యరసప్రధానమైనది, హాస్య

రసమునకు నవ్వే యాయువుపట్టనుమాట రసికురాల వగు నీ వెఱుఁగనిది గాదు.

న.—నవ్వు కేవల హాస్యరససంబంధి యనుటకు వీలు లేదు. అది యీ ప్రపంచములో బహుకారణజన్యమును భిన్నకార్యజనకమును గూడ నగుచున్నది—విద్వేషవ్యంజక మగు విషపునవ్వు, ఆత్మార్జవానందసూచక మగు నమాయికపునవ్వు, వెడవిల్తు వికారముల వ్యక్తీకరించు వింతనవ్వు, పరిహాసద్యోతక మగు వంకరనవ్వు, బ్రహ్మకైనఁ గారణము బయలుపఱుపవశముగాని వాతులాలయముదారినవ్వు—ఇట్టి వెన్నియో రకముల నవ్వు లున్నవి.

సూ.—ఔను, స్పర్శమువంటిదే హాసమును.

సీ. అమ్మ బిడ్డను ముద్దు•లాడు తాఁకుడు వేఱు,
దండనస్పృష్టివి•ధంబు వేఱు
సద్గురుహస్తమ•స్తక యోగకృతి వేఱు
తర్జనస్పర్శంబు•దారి వేఱు
చల్లనిచందన•చర్చాక్రియలు వేఱు
వ్రణలేపనముల తె•ఱంగు వేఱు
కోమలాంగులయుప•గూహనంబులు వేఱు
బలవంతులౌ జెట్ల•పట్లు వేఱు

గీ. కతములును వేఱు హానివా•కార్యములును
వేఱుగా నుండు; హాస మ•ట్విధముగాన
పెక్కు తెఱఁగుల మనకుఁ గా•న్పించు; నిచటి
నవ్వు చింతాపహం బగు•నవ్వె సుమ్మి!

న—అట్లుమాత్ర మెట్లు చెప్పఁగలరు? అతిబాల్యవివాహములుచేసిన వారిచిత్తముల నీయుపహాసాసిపుత్రిక గ్రుచ్చుకొని యెంతబా ధించునో యెవ రెఱుఁగుదురు ?

సూ—బాధించి వాని మానిపించుటచేత—

గీ. వారికైనను జివర కీప్రహసనంబు
మేలె చేకూర్చు; బాధ తాత్కాలికంబె;
కాన నిది హింసకం బగుకత్తి గాదు
శస్త్రవైద్యునిచేతి శస్త్రంబు గాని.

న—అట్లే కానిండు! అయినను గవి, యున్న దున్నట్లు వర్ణింపక, యసంభవములను అతిశయోక్తులను గూర్చి యీప్రహసన మేల చేయవలయును ?

సూ—నీ వసంభవము లనుకొనుచున్నవి విపరీతసంభవములు గాని యసంభవములు గావు. ఇఁక నతిశయోక్తులు యథేచ్ఛముగా వాడుటకుఁ గవి కధికారము గలదు. అది యుచితమే.

గీ. చిన్నరోగాణుజీవి నక్షికిని బెద్ద
గాఁగఁ జూపుచు లోకోపకారక మగు
భూతకాచంబుమాడ్కి మేలొనరుచుఁ గవి
స్వల్పదోషంబునైనఁ గొండంత చేసి.

అదియుఁ గాక సాక్ష్యములలో సర్వానర్థకరము లగు నతిశయోక్తులు ప్రహసనములకుఁ బంచప్రాణములును. అవ్వి లేకున్న నవ్వే పుట్టదు.

న—మీరు ముదురుపెండ్లిండ్లపక్షమువారు కాఁబోలు!

సూ—అతిబాల్యవివాహములట్లే యవియు నాకు గర్హ్యములే. కాని

రెండేండ్ల బాలికకును నాలుగేండ్ల బాలకునకును గావించుపెండ్లి నీకిష్టమేనా ?

న—అది యేమిపెండ్లి ! నామొగముపెండ్లి !

(తెరలో)

కనకమ్మమఱఁదలా ! యేమిపెండ్లి ! నామొగముపెండ్లి !

వ—సుందరమ్మపాత్ర మప్పుడే వచ్చి ప్రదర్శనప్రారంభము చేయుచున్నది. మన మిఁకఁ బోవుదము రండు !

(ఇద్దఱును నిష్క్రమింతురు.)

---

శ్రీరామ.

# విచిత్రవివాహము.

## ప్రథమాంకము.

ప్రదేశము—కాంచీనగరము.

ప్రవేశము—గంగ (వితంతువు), సుందరమ్మ (వితంతువు), కనకమ్మ.

సుం—కనకమ్మ మఱఁదలా! ఏమి పెండ్లి. నా మొగము పెండ్లి- నవ్వులాటపెండ్లి- పనికిమాలిన పెండ్లి.

కన—సుందరమ్మ వదినా! ఏమి చేయుమందువు? శారదచట్ట మింకఁ ద్వరలో రానై యున్నది. అది వచ్చిన తరువాతఁ బిల్లకుఁ బదునాలుగేండ్లు దాఁటినఁగాని వివాహము చేయఁగూడదయ్యెను. నేను బండ్రెండుసంవత్సరములకే పెద్దదాన నైతిని.

గం—నేను బదునొకఁడేండ్లకే యీడేరితినమ్మా. నాది మఱియు నుల్కాపాతమైనదమ్మా- ఎక్కడను జూడలేని వింతయమ్మా- సుందీ! నీ సమర్తనాఁటికి నీ వెన్నియేండ్లదానవో జ్ఞప్తి యున్నదఁటే?

సుంద—అమ్మా! జ్ఞప్తియున్న విశేషమేమి- లేకున్న లోపమేమి? నేను మగని మొగ మెఱిఁగినదాననా? ఏడ్చినదాననా? ఏమో దిక్కుమాలినపుట్టుక పుట్టినాను. ఇఁడుదాన నని మీ రందఱు

చెప్పుచుండుటచేత సరే యని యొప్పుకొంటినిగాని నాకేమి మగఁడా మొద్దులా? పడుకయా బండయా? కొడుకులా కొమ్మలా? సౌఖ్యమా చట్టుబండలా?

గం—అందుకుఁగాదే, తల్లి! మామ్మా, మేనత్తసంప్రాయము లెట్లున్నవో చూచుకొందమని కాదఁటే- నీవు కుఱ్ఱదానిమేనత్తవు కావున నీమాట తేవలసివచ్చినదమ్మా- అ దేదో సంవత్సర మమ్మా- ఆఁ ఆఁ జ్ఞప్తికి వచ్చినది. రాక్షసనామసంవత్సర మమ్మా- జ్యేష్ఠమాసమమ్మా- ఆసంవత్సర మధికజ్యేష్ఠము వచ్చినది. ఆమాసమం దమావాస్యదినమున మీతండ్రి తర్పణాలు విడుచుటకుఁ బ్రయత్నించుచున్నారు. 'సుందీ! వొంకని తెలుకులదానింటికిఁబంపి నూవులు తెప్పింపవే'యని మీతండ్రి యన్నారు. నీవు పలుకలేదు. కుఱ్ఱది యెందులకుఁబలుకలేదో యని నేను వాకిటిలోనికి వచ్చి చూడఁగ నీవు స్తంభముచాటున నేడ్చుచున్నావు. ఏమైనఁ గుట్టినదా యని నేను భయపడి పదేపదే యడిగితిని. ఊహుఁ—ఊహుఁ—అనిమాత్రమని తిరుగ నేడు పారంభించితివి. ఎందుల కేడ్చుచున్న దని మీతండ్రి లోనుండి కేకలు వైచుచుండెను. పదిసంవత్సరములు వెడలి సరిగా మూఁడుమాసములై యుండుటచేత నోహో యిదేకాఁబోలు నని యప్పటికి స్మరణకుఁ దెచ్చుకొని యప్పుడద్దేదే యని నలువురుముత్తైదువులను బిలిచి చాపమీఁదఁ గూర్చుండఁబెట్టించి సమర్తపాట పాడించితిని- జ్యేష్ఠమాస మయ్యెను. జ్యేష్ఠురాల వయ్యెను. సమర్తనక్షత్రము జ్యేష్ఠ యయ్యెను. మూఁడుజ్యేష్ఠలు మూఁడగ్నులలాగు గలిసికొనుటచేత నింతపుట్టి మునిఁగినది. అందుల కేడ్చుచునే

యున్నానమ్మా. ఇంతకుఁ జెప్పవచ్చినమాట యేదనఁగా, మేనత్తదికూడ లేఁతసమర్తసంప్రదాయమే యని దేవులాడు చున్నాను. అందుచేఁ జంటపిల్లకుఁ బెండ్లి వెంటనే చేయక తప్పదు.

సుం——సిగ్గుబిడియములులేక, మంచిచెడ్డలులేక, చావుబ్రదుకులుకూడ నెఱుఁగక రెండేండ్లబిడ్డకుఁ బెండ్లిచేసెదరా? ఇదేమి పిల్ల కుగ్గుపోయుటా? పాలుపోయుటా? నీళ్ళుపోయుటా? రసభస్మమువేయుటా? సాంబ్రాణిపొగవేయుటా? పెండ్లి యనఁగా నేమనుకొంటిరి? ఒడిలోఁ బాలుత్రాగుపిల్లకుఁ బెండ్లియా? అడ్డాలలోనుండి పాలుద్రాగుచున్నపిల్ల పెండ్లిపీఁటమీఁదఁ గూరుచుండునా? తలఁబ్రాలు పోయవలయునుగదా- వదినా! నీవు పోయుదువా యేమి? సప్తపాదాలు ద్రొక్కవలయును గదా- అమ్మా! నీవు త్రొక్కుదువా యేమి? పాన్పుమీఁద భర్తతోఁ గూరుచుండవలయునా? పుట్టుముండమైన నన్నుఁ గూర్చుండఁబెట్టుదురా యేమి?

కన——ఈచిక్కులన్నియు వదినా నాకును దెలియును. కాని యేమి చేయుమంటివి. పిల్ల పెద్దదైనయెడల నేమి చేయవలయును? ఆమాట స్పష్టముగాఁ జెప్పు—

సుం——ఏమిచేయవలయునా? మూఁడుదినములు వాకిటిలోఁ గూరుచుండఁబెట్టి నాల్గవనాఁడు స్నానముచేయింపుము. అంతకంటె నేమి చేయవలయును? నీ కేమి చేసినారు?—నా కేమి చేసినారు? అమ్మా! నీ కంతకంటె నెక్కువ యేమైనఁ జేసినారా?

కన—అదిగా దమ్మా- పెండ్లికాకుండఁ బిల్ల పెద్దదైనయెడల మతము పోవు ననికాదా ?

సుం—ఇప్పుడుండి యేడ్చినదా యేమి ? బ్రాహ్మణులలో వేదాధ్యయనము చేసినవా రెందఱు ? ఆచేసినవల్వురిలోపల నాచరణమున్నవా రెందఱు? ఒక్కవ్రేలైన వంగుట కవకాశమున్నదా? మగవారిలో బ్రహ్మచర్యవ్రతము చేసినవా రెందఱు? యోగాభ్యాసము చేసినవా రెందఱు ? శమదమాదిసంపత్తి కలవా రెందఱు ? ఇవి యన్నియుఁ దుడిచిపెట్టికొనిపోయినను మత మింకను పీఁటపెట్టుకొని కూరుచుండినదా ? ఎటువచ్చినను బెండ్లి కాకుండఁ బిల్ల యీడేరినయెడల మతము మట్టిగొట్టి కొనిపోవునా ?—ఇదెక్కడిమతము ? మతమునకు సర్వేశ్వరునితో సంబంధ మున్నది కాని సమర్తతో లేదు.

కం—సుందీ ! ఏమిటే ఒక్కటే చదువు. మతము వేదాలతోనే యున్నదనుకొన్నావా యేమి ? వేదాలలో లేని వెన్నియాచారాలున్నవి. మన కాచారాలు ప్రధానము కాని వేదాలు కావు. నేను రాత్రి మినుపరొట్టెతినుట వేదాలలో నున్నదా యేమి ? మానాన్న పోయినతరువాత మా యమ్మ తిన్నది. మామామగారు పోయినతరువాత మా యత్త తిన్నది. ఆలాగున తీగసాగుచున్న యాచారము తెగినప్పుడు మతము తెగిపోవును గాని మఱియొకటి కాదు. వేదాలు శాశ్వతము లనుకొన్నావా యేమి ? ఈవేదాలవంటి విదివఱ కెన్ని నశించినవో- ఆచారాలుమాత్రము మట్టివి కావమ్మా- వేదాలు మన తలలోని కెక్కలేదు కాని యాచారాలుమాత్రము మనకస్థిగతములై యున్నవి. సమర్తాడకుండఁ బెండ్లిచేయుట సదాచా

రము. అది దాఁటఁగూడదు. మన మొక్కారమే చేయుచున్నామా యేమి? గురప్పశాస్త్రులుగారి మూఁడేండ్ల బిడ్డకు నిన్నఁగాక మొన్న సర్పవరపుగుడిలోఁ బెండ్లికాలేదా?

సుం—నీయిష్టమమ్మా. నాకెందులకు?

కన—రవంతజ్ఞానమువచ్చిన పెండ్లికూఁతురైనయెడలఁ దలఁబ్రాలుపోసికొనుట యని, చెండ్లాడుకొనుట యని, పెండ్లికొడుకు పెండ్లికూఁతు నెత్తుకొనుట యని యేవో యచ్చటలు ముచ్చటలు బాగుగా జరుగును. అవి లేకపోవుటవలన వట్టిబొమ్మలపెండ్లివలె నుండు నని విచారించుచున్నాను.

గం—ముద్దులు ముచ్చటలు తరువాత జరుగఁగూడదఁటే? ఎల్లకాలము పిల్లలు పిల్లలుగానే యుందురా? పెండ్లికూఁతురు పెండ్లికొడుకు చేసికొను ముచ్చటలేవో వియ్యపురాం డ్రొక్కరికొక్కరు చేసికొనఁగూడదా? వియ్యంకుఁడు వియ్యంకుఁడు నొకరిమీఁద నొకరు బుక్కా చల్లుకొని, పూలచెండ్లతోఁ గొట్టుకొనఁగూడదా? ఏవో కొన్ని వేడుక లుండును గాని బొత్తిగా బొమ్మలపెండ్లిలాగున నుండదులే. మఱి యేమి చేయను?

సుంద—అమ్మా! వియ్యపురాలు వియ్యపురాలు తలఁబ్రాలు చల్లుకొన్నయెడల నెట్లుండునో చెప్పనా? పెండ్లికొడుకు ముత్తవ తల్లియు నీవును నొకరిమీఁద నొకరు విభూతిఁ జల్లుకొనునట్లుండును. పెండ్లికొడుకువైపుమంగలి, పెండ్లికూఁతువంకమంగలి చుట్టకు చుట్టకు నిప్పంటించుకొనునట్లుండును.

గంగ—సుందరీ! [illegible]

సుం—మీరు చేయఁదలఁచుకొన్న చర్యలకంటె నవకతవకలు కా వమ్మా—

గం—శుభకార్యములలో నన్ని లోపములే. ఏదో చూచిచూడ నట్లు జరిగించుకొనిపోవలయునుగాని చేతచేతకుఁ దప్పుపట్టుకొని, మాటమాటకుఁ దప్పు పట్టుకొన్నయెడల శుభకార్యములు చేసినామే- కార్యమగుట కావలసినది కాని—

సుం—అమ్మా! ఇతరలోపములమాట నేను జెప్పలేదు. వీఁడు పెండ్లికొడు కని పెండ్లికూఁతునకు, నది పెండ్లికూఁతు రని పెండ్లికొడుకునకు రవంత తెలియనక్కఱ లేదఁటే ?

గం—అప్పుడు తెలియకపోయినంతమాత్రమున నది పెండ్లికాదా యేమి ? తరువాత తెలియకమానునా ? ఈడువచ్చినపిల్లపెండ్లికిమాత్ర మన్నియు మొదటఁ దెలియునా యేమి ? ఏవో కొన్ని తెలియకపోవుట బ్రాహ్మణవివాహముల కాచారమయియే యున్నది. అందులో రవంత హెచ్చుతగ్గులుకాని యంత కంటె నేమున్నది ?

సుం—అటులైన వదినకడుపులోని మూఁడునెలలపిల్లకుఁగూడ నిప్పుడే పెండ్లి చేయరాదా ?

గం—తెలివితక్కువమాట లాడకు. కడుపులోనిపిల్ల మగవాఁడో యాఁడుదియో తెలియకుండ నెవరికిచ్చి పెండ్లిచేసెదవే? ఏమి మాటలే!

కన—అత్తా! ఈమాటల కేమి ? పెండ్లికొడుకును జూచి మీరాకుమారుఁ డిప్పుడు రానైయున్నాఁ డని నే ననుకొందును.

సుం—ఎవరిసంబంధముఁ జూచుటకు వెళ్లినాఁడు ?

గం—ఈసంబంధ మాసంబంధము లేదు. ఏది కుదురునో యదే.

సుం—అట్లైనఁ బెండ్లి తప్పదన్నమాట.

గం—పెండ్లితప్పినయెడల మనమానుషము తప్పును. మనబ్రదుకులు తప్పును. అందుకు సిద్ధపడినయెడలఁ బెండ్లి మానవచ్చును.

(వెంకటరావు ప్రవేశించును.)

గం—నాయనా! వచ్చితివా? ఏదైనఁ గుదిరినదా?

వెం—అన్ని సంబంధములుఁగూడ నిదివఱకే యేర్పాటైపోయినవి.

కన—ఇప్పు డేమియుఁ గుదురనే లేదా?

వెం—కుదిరినది. మహాకష్టముమీఁద.

గం—కష్టాని కేమి కుదిరినదా? ఈమతవినాశకపుఁజట్టము కష్టములకు రాక సుఖమునకు వచ్చినదా యేమి?

కన—కష్టముమీఁద ననఁగా నాకుఁ దెలియలేదు. ఏమాకష్టము?

వెం—కట్నము మూఁడువేయినూటపదా ర్లీయవలయును. ఆఁడుపడుచులాంఛనాలు—అత్తగారి లాంఛనాలు—అయిదు వందలు. ప్రస్తుత మీసొమ్ములో సగము వారికిఁ బంపవలెను. ఎన్నివిధములఁ బ్రాఁకులాడినను నొక్కపైసయైనఁ దగ్గించుట కవకాశము లేకపోయెను.

గం—ప్రస్తుతము సొమ్మీయవలయునని చెప్పితివికాదా? నాగుల్లలు సుందిగుల్లలు తాకట్టుపెట్టి యిచ్చెద మనుకో. వారాసొమ్మున హరించినయెడలఁ జేయున దేమి?

వెం—హరించుట జరగదులే. అయినను నీవన్నమాట కొంత యాలోచింపఁదగినదే- ఈనడుమ సుబ్బన్నశాస్త్రి మనలాగే కొందువే లిచ్చుట కొప్పుకొన్నాఁడు. ఇచ్చినాఁడు. పెండ్లినాఁడింకొక్కవేయి యిచ్చినఁగాని పెండ్లికి రామని పెండ్లికొడుకువా రన్నారఁట! నాగప్పసోమయాజులు తనకూఁతుపెండ్లి

మూఁడువేలు కట్నమిచ్చుట కొప్పుకొన్నాఁడు. ఇచ్చినాఁడు. ఈలాగుననే యిఁకనిద్దఱియొద్ద నాపెద్దమనుష్యుఁడు కట్నములు వసూలుచేసినాఁడు. పెండ్లికొడు కొక్కఁడు. పెండ్లికూఁతులు ముగ్గురు. తీరఁ బెండ్లినాఁటి కాపెద్దమనుష్యుఁ డెక్కడికి పోయినాఁడో- ఆరతికర్పూరములాగున హరించిపోయినాఁడు. ఆపెండ్లికొడు కున్నాఁడు. ఆతని నడుగగా నేను బెండ్లిసంగతి యేమియు నెఱుఁగ నన్నాఁడు. నీ వాతనికొడుకవు కాదా యని నాగప్ప యడిగినాఁడు. అబ్బే! నన్నుఁ దనకు నెలదినములపాటు వంటచేయుట కింటఁ బెట్టికొన్నాఁ డని పెండ్లికొడుకు చెప్పినాఁడు. పోని ఆపిల్లవానికైన నీయవలయు నని నాగప్పసోమయాజు లాలోచించినాఁడు- నేను నపుంసకుఁడను. నాకుఁ బెండ్లియెందుల కని వాఁడనుటచేత నూరకుండినాఁడు. య్యో! మీరు వినలేదుకాఁబోలు. మఱియొక చిత్రము జరిగినది. తిరునారాయణమ్మ నెఱుఁగుదువా వదినా?
ఎఱుఁగకేమి? శ్రీవైష్ణవులయ్యును వేపారులలాగునఁ గచ్చపోసి చీరకట్టునామెయే కాదా- పిరాట్టమ్మ అక్కగారు.

కన—ఆమె కది యొకముచ్చటలే. ఆమెనడక చూచితివి కాదా- కాలిసొట్టతనము కనఁబడకుండ నొయ్యారముగా నడచుమదగజయాన. అత్తా! నీవుకూడఁ జూడలేదా?

గం—ఓసి నీయిల్లు బంగారము గాను. నేను జూడకపోవుట యేమే? నాతలకాయలాగున పాపట కీపక్క నాప్రక్క బట్టతలయే కాదఁటే. ఇఁక దానిచెల్లెలు పిరాట్టమ్మ. అదిక్కుమాలినపాదము—దానియిల్లు మాసిపోను. ఎక్కడఁ బెట్టిన నక్కడే భస్మము! వట్టి తుసుపులమ్మవాను.

వెం—చిత్రమేదో చెప్పక యీచింకిచేఁటస్త్రీవర్ణన లెందులకు ?

కన—ఔను నాథా ! మఱచిపోయితిని. ఆతిరునారాయణమ్మ తన కూఁతునకుఁ బెండ్లికై పిల్లవానిని జూచివచ్చినది. వాఁడు పదు నాలేండ్లవాఁడు. తొగరుదారములాగున సన్నఁగ నెఱ్ఱగ బాగుగనే యున్నాఁడు. పెండ్లి స్థిరపఱచుకొని కట్నము రెండు వేయినూటపదార్లిచ్చినది. పెండ్లివారు వచ్చినారు. తొందరలో మంగళస్నానాలు చేయించినారు. తీరఁ జూడఁగఁ బెండ్లికొడుకఱువదేండ్లవాఁడు. ఎడమవైపు పక్షవాతము. నేను జూచినపెండ్లికొడుకు వీఁడు కాఁడే యని తిరునారాయణమ్మ యేడ్చినది. తల్లి యేడ్చినదికదా యని యాచారముకొఱకు పిల్ల యేడ్చినది. తండ్రిలేని కుఱ్ఱది. మీరు చూచిన దీపిల్లవాఁడే యని పెండ్లివా రన్నారు. పిల్లవాఁడేమి—నా శ్రాద్ధము. సగము చచ్చిన షష్టిపూర్తిడొక్కు. తాను జూచిన పెండ్లికొడుకు వీఁడు కాఁ డని తిరునారాయణమ్మ ఋజువుచేసికోవలసివచ్చినది. దానితరమా ? పీఁటలమీఁదిపెండ్లి మానఁగూడ దని కొంద ఱన్నారు. ప్రాప్తి యెంతో యంతయే యని కొంద ఱన్నారు. భగవదిచ్ఛకు వ్యతిరేక మెట్లు జరుగు నని కొంద ఱన్నారు. ఎలాగైన నేమి తిరునారాయణమ్మయేడు పెవ్వరు వినలేదు. ఈగొడవ యేమో తెలియఁగని కుఱ్ఱదానిగోల యంతకంటె వినలేదు. ఒకచేయి స్వాధీనముకాకపోవుటచేత మిగిలియున్న తనచేతికిఁ బురోహితునిచేయి సాయముతీసికొని కష్టముమీఁద ముక్కాలిపెండ్లికొడుకు మూఁడుముళ్ళు పెట్టినాఁడు.

గం—ఈ శారద యన్న యాబిడ యాఁడుదియేకదా—ఆఁడుదాని

కష్టము లన్నియుఁ దనకు బాగుగాఁ దెలియునుగదా. ఈచట్టము తాను తీసికొనిరావలసినదా ?

వెం—శారద యాఁడుది కాదు. మగవాఁడు.

గం—ఆలాగునఁ జెప్పుము. నే నప్పుడే యనుకొన్నాను. ఈవ్యక్తి మగవాఁడైనఁ గావలయును. కాక యాఁడుఁదన మంతయు నెండిపోయిన వరుగైన గావలయు నని యనుకొంటిని. మగవాఁడైన యెడల నాఁడుదానిపే రేల పెట్టుకొన్నాఁడో ? నా పుట్టినింటియూరిలోఁ బేరమ్మ యని యొక యొంటరి యుండువాఁడు. పేరమ్మ యనుపేరు వినుటతోడనే కన్య యనుకొని మొందఱు పెండ్లికొడుకులో చూచుటకు వచ్చి పెదవి విఱిచి వెకవెకలాడి పోయెడివారు. అప్పటికి వార్తాపత్త్రికలు లేక పోవుటచేత పేరమ్మ మగవాఁడే కాని యాఁడుది యెంతమాత్రము కాఁడని చుట్టుపట్టులగ్రామములలోఁ జాటింపించినారు. గోడలమీఁద నాయనబొమ్మ గీచి యాయనపుంస్త్వమును బ్రకటించినారు. తుట్టతుద కెవ్వరో పిల్ల నిచ్చినారు. తీర సంసారములో దిగఁబోయినప్పు డీతఁడు విస్తరిముందే కాని పరిక్కమీఁది కక్కలకు రాఁడని స్పష్టపడినది. ఇదిగో ! ఆపే రున్నదే అదే యింతపుట్టిమునకకుఁ గారణమైనది. ఏమైననేమి. ఆఁడుదానిపేరు పెట్టుకొని యాపేరయ్య యాఁడుదానికొంపఁ గూల్చినాఁడు. అట్లే యీశాసనపరివక్త యాఁడుదానిపేరు పెట్టుకొని యాఁడువారికొంప నట్టేటఁ గట్టినాఁడు. ఆఁడుదానికి మగపేరు పనికిరాదు. మగవాని కాఁడుపేరు పనికిరాదు. పేరిలో నేమున్నదని పెద్దలన్నారు కాని స్వభావము మార్చుటలోఁ బేరంత పటుత్వము గలది మఱేదియు లేదు.

సుం.—ఈగొడవ మనకెందులకుఁ గాని తమ్ముఁడా! పెండ్లికొడుకును జూచితివా ?

వెం—చూచితిని. పైయాశ్వయుజమాసమునకు నాలుగుసంవత్సరములు వెడలునని జాతకమువలనఁ దెలిసినది.

కన—అంతకన్న రవంత పెద్దవాఁడు దొరకలేఁడా ?

వెం—ఈపిల్లవానియన్నయే యున్నాఁడు. అతఁడితనికంటె నొక్క సంవత్సరము పెద్ద. అతనికి బదునైదుదినములక్రిందటనే పెండ్లియైపోయినది.

కన—అయ్యయ్యో! మీ రాలస్యము చేసినారు. త్వరగఁ బోయి సంబంధము చూడుఁడని నేను మొత్తుకొనుచునే యున్నాను.

వెం—జరిగిపోయినదానికిఁ జింత యెందులకు? పిల్లవాఁడు మిక్కిలి చిన్నవాఁడైపోయినాఁడని మనకుఁ గాఁదగిన వీరశానితో నేనంటిని. అట్లైనయెడలఁ బెద్దపిల్లవానికే రెండవపెండ్లికూడ చేసెదను; హిందువుల కట్టి బహుభార్యాత్వమున కధికారమున్నది కాదా యని యాతఁడన్నాఁడు. కాని నామనస్సందున కొప్పుకొనలేదు.

గం—పిల్లవాఁడు తప్పటడుగులు వైచుచున్నాఁడా?

వెం—నడచుట కొంచె మాలస్యమైనదఁట. చిన్నత్రోపుడుబండికి వెనుక నిలువఁబెట్టి నడక చెప్పించుచున్నారు.

సుం—మాట లేమైన వచ్చునా ?

వెం—నేను మాటలాడింపలేదు. చేరెఁడేసికన్నులు. పిల్లవాఁడు బాగుగనే యున్నాఁడు.

గం—నాయనా! విను. తల్లిదండ్రులు గలసంబంధము. మొగ్గ కాయకోవలోవారేకాని పండిరిరాటకోవలోవారు కారు. మాటలా

డక పెండ్లి చేయవలసినదే కాని యాలస్య మగునెడల నందఱు గంగలో దిగవలసివచ్చును.

వెం—అందుకొఱకే యొప్పుకొంటిని. ఏమే- నీయభిప్రాయ మేమి ?

కన—ఏదో యొకటి. ఏమి చేయఁగలము- నుదుటివ్రాలెట్లో యట్లు జరుగక తప్పదు. ఇంతకు మగపిల్లవాఁడుకద !

సుం—ఆసంగతి యింకను బహునాలుగేండ్లకుఁగాని స్పష్టముగా దెలియదులే.

గం—పోనిమ్మా. నీమాటలు నీవును. సీతాఫలపుఁబూవేదో సంపెంగ పూవేదో తెలియదా అమ్మా ! అందులోను- అది యున్నదే బొత్తిగా దాగదమ్మా- చిన్నతనములోను పెద్దతనములోను గూడ దాగదమ్మా- మగఁడు లేక నీవిబ్బందిపడినట్లే యుంటి కూడ నది యెంత యిబ్బందిపడునేమోయని మమకారముచేత నీ వాందోళనపడుచుంటివి కాని నీ కాసందేహ మక్కఱలేదు. ఆదారియే వేరమ్మా- కాని నాయనా ! పెండ్లివారి యింటి పేరు?

వెం—ఏదో మంచిపేరే- జ్ఞప్తిలేదు. ఇదిగో—

కన—వారి యింటిపేరు తెలియకున్నయెడల కట్నపుసొమ్మువరికిఁ బంపెదరు ?

వెం—చిన్నపుస్తకములో వ్రాసికొన్నానులే. ఆపుస్తకము మూటలో నున్నది.

గం—గోత్రఘటన యున్నదికాదా ?

వెం—అవియన్నియుఁ జూచుకొన్నాము సరిగానే యున్నవి.

సుం—పిల్లవాని కెవ్వరైన విధవతోడఁబుట్టినవా రున్నారా ?

వెం—ఒక్కతెయే యున్నది.

సుం.—ఆఁడుబడుచులాంఛనాల కైదువంద లీయవలె నంటివే. పుణ్య స్త్రీకిఁ బచ్చగఁ బచ్చగ లాంఛనాలు కాని వితంతునకు లాంఛనా లేమిటి ? మాకు లాంఛనాలు పాత్రి పంచ, మినుప రొట్టె, విభూతిపండు, రుద్రాక్షలతావళమే కావా ?

గం.—ఆయననోట మట్టికొట్టుకొని యాయన పోయినాఁడు కాని యామె కాఁడుపడుచుఁదనము పోయినదా ? అమ్మా- చెంగున కంచుపోయినది కాని మూటఁగట్టుకొను ముచ్చట పోయినదా ? అమ్మా ! కాంతుఁడు పోయినాఁడు కాని కట్నపాళి పోయినదా ?

వెం.—సొమ్మెంత త్వరగఁ బంపుదుమో యంతత్వరగ ముహూర్తనిశ్చయము జరుగును.

గం.—సొమ్ముమాట యేమి చేసినావు ?

సుం.—నీగుల్లలు నాగుల్లలు కొడుకుఁబెట్టవలసిన దని నీవు ప్రారంభమునఁ బెండ్లిపాటఁ బాడితివి కాదా ?

వెం.—తాకట్టుపెట్టినవస్తువులు తిరిగి వదల్చుకొనలేము.

సుం.—తెగనమ్ముటయే నీయభిప్రాయమా ?

వెం.—ఔను.

సుం.—వస్తువు లే ?

వెం.—వస్తువులు కావు మాన్యము.

గం.—సాలుకు సరిపడిన గింజలు వచ్చుచున్నమాన్యమమ్ముకొని నోట వ్రేలుపెట్టుకొని కూరుచుండవలసినదా ?

వెం.—ఏదో చేసెదను. మీ కెందులకు ? పోయి పండుకొందమురండు. పెండ్లి జరుగుటమాత్రము నిశ్చయము· ఆప్రయత్నమున నవశ్యముండవలయును·　　　　(అందఱు నిష్క్రమింతురు.)

ఇది ప్రథమాంకము.

శ్రీరామా.

# విచిత్రవివాహము.

## ద్వితీయాంకము.

వెంకటరావు, గంగ, సుందరమ్మ, ప్రవేశింతురు.

గం—ఎక్కడిపని అక్కడే మొందిపడినది. అప్పడాలు లేవు. వడియాలు లేవు. పప్పులు లేవు. పిండ్లు లేవు. పసుపులు లేవు. వెల్లలు లేవు. ఈరాత్రి ముహూర్త మని మొన్నను వార్తయైనయెడల నేలాగునఁ జావవలసినది?

వెం—అమ్మా! అపశకునపుమాట లాడవలదు. మఱేమియుఁగష్టము లేదు.

గం—నాచావుమాట చెప్పితిని. మీరందఱు సుఖముగా నుండగా నేను వెడలిపోవుట నాయదృష్టము కాదా?

వెం—పెండ్లి యింకొక జాముండగా నదిమాత్ర మొందులకమ్మా?

సుం—తమ్ముఁడా! అమ్మ నేమియు ననకుము. పెండ్లితగినంత వేడుకగా జరుగుట కవకాశము లేకపోయెనే యని యామె విసుగుకొనుచున్నది.

వెం—అమ్మా! క్షమింపుము. అక్కా! నీమఱఁదలేది?

సుం—మఱందలా ! ఏమిచేయుచున్నావు ?

(నేపథ్యమున) తల దువ్వుకొనుచున్నాను.

వెం—అది యింతట తెమలునా ? నీమూలమున నాలస్యమగు నని నాకు భయముగా నున్నది.

(నేపథ్యమున)

నామూలమున నాలస్య మేమియు నుండను. తల దువ్వుకొనుట, మొగము రుద్దుకొనుట, బొట్టు పెట్టుకొనుట, చీర కట్టుకొనుట. ఇంతియే కాదా ? ఏమైనం దగిలించుకోవలయునా? పెట్టుకొనవలయునా ? తొడుగుకొనవలయునా ?

వెం—అట్లైన చదువక త్వరగం దెమల్పవలెను. ఇంకను బురోహితుండు రాలేదేమి ?

పురోహితుండు—(ప్రవేశించి) నేను వచ్చి గంటసేపయిన దయ్యా ! మీరింక నిద్రించుచున్నారు. ఇంతలోం బ్రక్కయింట్లో లక్ష్మీవత్తులవ్రతములో సంభావనకై పోయి యటనుండి దయ్యాల మఱ్ఱిచెట్టుక్రిందికిం బోయితిని. అప్పుడే మీపెండ్లివారక్కడ విడిసియున్నారు. అందుకొఱకు వెంటనే పరుగెత్తుకొని వచ్చితిని. త్వరగ రండు పోవుదము.

వెం—ఏమే- ఏమి చేయుచున్నావు ? త్వరగం బోవలెను. (పురోహితునితో) మీతండ్రిగారు వత్తురని యనుకొంటిని. నీవు వచ్చితివేమయ్యా !

పురో—ఆయన వీరభద్రస్వామిగారింటికిం బోయినారు. అక్కడం బెండ్లి సగ మగుసరికి తహాశ్శీలుదారుగారి భటుండు వచ్చి యాతనిని వారియింటికిం దీసికొనిపోయినాండు.

వెం—వీరభద్రస్వామియింట్లో మిగిలిన పెండ్లి యెవరు చేయించినారు?
పురో—తిరుపతిక్షౌరమువలె నట్లే నిల్చియున్నది.
వెం—అట్లు చేసినాఁ డేమి?
పురో—అన్నిచోట్ల పెండ్లిం డ్లొక్కసారియే తగులఁబడిపోయినప్పు డేమి చేయవలసినది?
వెం—నీవప్పు డెక్కడ నున్నావు- నీవు చేయింపలేకపోయినావా?
పురో—నే నీలోపల మూఁడుపెండ్లిండ్లు చేయించినాను. ఇక్కడ మంగళస్నానాలప్పుడు మఱొక్కచోట విఘ్నేశ్వరపూజ. ఇక్కడ ఫలప్రదానము లైనప్పు డక్కడ సుముహూర్తము. ఇందులో నొక్కయడుగు. నందులో నొక్కచేయి, ఇందులో నొక్కమంత్రము- అందులో నొక్క తంత్రము. కలగపులగముక్రింద కొట్టుకొని వచ్చినాను. ఏమిచేయుమన్నారు?
కాం—నీవు పెండ్లిమంత్రము బాగుగాఁ జెప్పఁగలవా?
పు—నా చేతిమీఁదుగా నీమాసములో రెండువందలడెబ్బది పెండ్లిం డ్లయినవి.
గం—అందులో మిక్కిలి చిన్నపిల్లల పెండ్లిం డ్లేమయిన నయినవా నాయనా!
పు—అమ్మా! నేను దిన్నగఁ జూచియేడ్చితినా? కన్నులు మూసికొని నాల్గుమంత్రము లేకరువుపెట్టుటయే నాపని. చూచిన మొదలమాత్రము జ్ఞప్తిలో నుండు టెట్లు? ఒక్కదేవాలయములో నొక్కముహూర్తమున నొక్క పౌరోహిత్యమున నిఱువది పెండ్లిండ్లు జరిగినవి. ఈశుభకార్యములలో గిజగిజ కొట్టుకొని చచ్చుచున్నాము. కాని త్వరగ రండు.
వెం—ఇదిగో- ఇంకను రావేమి?

(కనకమ్మ పరివేశించును.)

పురో—అమ్మా! పసపు కుంకుమము పండ్లు నక్షతలు తములపాకులు పోకచెక్కలు పారాణి నీళ్ళబిందె- యివి కావలసి యున్నవి. చప్పున నన్నియు సమకూర్పవలయును.

వెం—నీవు ముందుగా వచ్చి యన్నియుఁ జూచుకొని యుండవలసినది గాదా?

పురో—పంతులుగారూ! ఊపిరి విడుచుట కవకాశము లేని నాయవస్థ మీరు చూచుచున్నారుకాదా? అట్లు సెలవిచ్చుట ధర్మమా?

కన—సుందరమ్మవదినా! చప్పున లోనికి రా- అన్నియు జాగ్రత్త పెట్టుదము.

(ఇద్దఱు లోనికిఁ బోవుదురు.)

వెం—అమ్మా! నీవింటియొద్ద నుందువు కాదా?

గం—ఆమాట యేల చెప్పవలయును- పిల్లదాని నెవరు చూతురు?

పురో—అమ్మగారు కూడ రావచ్చును. చంటిపిల్ల కనుక పిల్ల నెత్తుకొని తల్లిగారు రావచ్చును.

వెం—పెండ్లికూఁతు నిప్పుడు తీసికొనివచ్చు నాచారము లేదుకాదా?

పురో—ఇట్టిపెండ్లి మాత్రి మాచారమా? మనము పని తెముల్చుకొనవలయును. ఇప్పుడు పెండ్లివారిని దెచ్చి విడిదిలో దింపుట, పిమ్మట వారు వచ్చి ప్రధానము చేసికొనుట, యాపైన వారు సుముహూర్తమునకు వచ్చి యధావిధిగ జరిగించుకొనుట- వీని కన్నిటికి వ్యవధి చాలదు. కావున వారిని దీసికొనివచ్చునప్పుడే వారుచేయు ప్రధానపుఁదంతుకూడ నక్కడనే జరిగించినయెడల బాగుగా నుండును. మనకుఁ గావలసినది ముహూర్తము. అది సరిగా జరిగింపవలసియున్నది.

వెం—ప్రధానముగూడ చెట్టుక్రింద జరిగించుటనాయభిప్రాయముకాదు.

పురో—నేను గొంత దూరదృష్టిచేతనే చెప్పితిని. మీయక్కగారి కింటియొద్ద ప్రధానము జరిగించుటచేత నది యక్కఱకు రా లేదు. కావున నాయాచారము తప్పించు నెడల మంచిదేమో-

వెం—అమ్మా! నీయభిప్రాయ మేమి?

గం—ఆచారము తప్పించుట యవసరమైనను గాకున్నను బురోహితుఁడు పని తెలిపికొఱకపశకునపుమాట పలికినాఁడు కావున వానియిష్టానుసారమే చేయవలయును.

పురో—నాపని తెలిపికొఱకు నేను జెప్ప లేదమ్మా. మీకిష్టమైనయెడల ద్వాదశావాస్సు లవిచ్ఛిన్నముగ వివాహముచు జేయింతును.

వెం—అట్లు చేయుట కిది యేమి శ్రాద్ధతంత్రమా? నోరు సంబాలించుకొనిమాటలాడుము. అన్నియునెఱిఁగినమీతండ్రి రాకపోవు టయేమి? అథము శుభ మెఱుఁగని కుఱ్ఱవాఁడవు నీవు వచ్చుటయేమి? ఎట్లు వివాహము జరుగునో యని భయముగానున్నది.

గం—(అప) వాని నేమియు ననకుము. లేచిపోయినయెడల బెండ్లి కాటంకము కలుగును.

పురో—పంతులుగారూ! మీకాసందేహ మక్కఱలేదు. మాతండ్రి జరిగించినట్లే నేనును జరిగింతును.

(కనకమ్మ చెప్పినవస్తువులతో- నీటిబిందెతో సుందరమ్మ ప్రవేశింతురు.)

పురో—సరి యికనేమి- పోవుదము రండు.

కన—మంగళ్లు రాలేదేమి?

పురో—ఈముండకొడుకు లున్నగాని శుభాశుభకర్మములు రెంటికి నట్టే.

వెం—నేను బోయి పిల్తును. ఇదిగో-ఒకఁడు వచ్చినాఁడు. నీవొక్కఁ డవు వచ్చినా వేమి?

మం—(ప్ర॥) సన్నాయివానిని గరణము గారి తుగారి పెండ్లికిఁ గొట్టుకొని పోయినాఁడు. డోలువాఁడను నేనొక్కఁడనే యున్నాను.

వెం—మేళమునకు ముందుగా సొమ్ముఁ దీసికొని యిట్లు చేసెదరా? డోలొక్కటి వాయించిన నేమి బాగుగనుండునురా?

మం—ముహూర్తము వేళకు సన్నాయివాఁడు వచ్చి కలసికొనును.

గం—గంగిత్తెద్దున కైన సన్నాయి డోలుండునే. (మంగలి డోలు వాయించును) అయ్యయ్యో.

పురో—పెండ్లి కొడుకునకు బట్టలీయవలయును గాదా. ఒక చాపుకూడఁ బల్లెరములో నుంపుఁడు.

వెం—(తెచ్చి యట్లు చేయును.)

పురో—సరే. బయలుదేరుఁడు.

వెం—వాయుదీపములవారు దొరకలేదు. అందుచేఁ దుపానులాంతర్లతోఁ బోవుదము. బ్రహ్మా! నీవొక్కలాంతరు పుచ్చుకో-నేనొక్కటి తీసికొందును. అమ్మా! నీవింటియొద్దనే యుండుము. పిల్లయొద్ద నుండుము. అక్కా! నీవు మాత్రము రా.

సుం—నే నెందుకులే. పెండ్లివారేమైన ననుకొందురేమో?

గం—నీవంటిది వారికొక్కతె యున్నది కాదా? ఒకరినొకరాక్షేపింపనక్కఱలేదు, వితంతువులేని యిల్లెక్కడనైన నున్నదా? వెన్నువాసము లేని యిల్లున్నది. మందువా లేని యిల్లున్నది. నూయిలేని యిల్లున్నది. దేవతార్చనలేని యిల్లున్నది. మగవాఁడు లేని యిల్లున్నది. పిల్ల లేని యిల్లున్నది. వితంతువు లేని యిల్లు లేదమ్మా. వితంతువే యింటికిఁ బునాదియమ్మా. పుణ్యస్త్రీలు

సంసారమున కవంత పైపైయలంకారములు మెఱుగులే కాని సంసారమునకుఁ బ్రధానవస్తువే వితంతువమ్మా. శుభకార్యములో నన్నియిండ్లలో వారిపెత్తనమే కాదా? అందుచే సుందీ! నీవు వెళ్లవచ్చునమ్మా.

పురో—నీవు వచ్చుట కభ్యంతరము లేదమ్మా! నెత్తిమీదఁ దుక్కు నిల్చియున్నది కాదా? అది వితంతువున కెంత కాపనుకొన్నావు!

(ముందు డోలుకొట్టుచు మంగలి నడచుచుండగాఁ బురోహితుఁడు వెంకటరావు చెఱియొకలాంతరు పట్టుకొని వెనుక నడచుచుండగాఁ గనకమ్మ పళ్లెరముతో, సుందరమ్మ చిన్నబిందెతో బయలుదేరుదురు.)

కన—అయ్యో. అమ్మవారికిఁ బణ్యార మిచ్చుటకుఁ బోవుచున్నట్లున్నది కాని యిది పెండ్లికి బయలుదేరునట్లు లేదు.

పురో—ఇంకను సంతోషింపవలసినదమ్మా! ఇక్కడ డోలైన నున్నది. అదియు లేని పెండ్లిండ్లు నాజుట్టులో వెందుకలన్ని జరిగినవి. సీమ రేకుడబ్బాలమీఁది దెబ్బలతోఁ గొన్ని పెండ్లిండ్లు, భజన తాళములతోఁ గొన్ని పెండ్లిండ్లు, జయఘంటల దెబ్బలతోఁ గొన్ని పెండ్లిండ్లు చేయించినాను. పెండ్లిపాలకి యెవ్వరికిని లేదు. ఒంటెద్దుబండ్లతో నూరేగింపు- ఓ దివ్యముగ జరిగిపోయినది. ఎప్పటి కేవిధముగా జరుగుట కవకాశ ముండునో యప్పటి కావిధముగా జరుపుకొనువాని కేమియు లోపము లేదు. ప్రపంచయాత్రకుఁ బ్రధానసూత్ర మిది. త్వరగఁ బోదము రండు.

(నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.

శ్రీరామ.

# విచిత్రవివాహము.

## తృతీయాంకము.



ప్రదేశము—కాంచీనగరము మఱ్ఱిచెట్టుక్రింద.

పరివేశము—కామరాజుసెట్టి, అతనికొడుకు జగ్గయ్య, భార్య వీరమ్మ, కూఁతురు సీత, ఒకరిద్దఱుభటులు.

కామ—ఈచెట్టుక్రింద గంటనుండి కూలఁబడినాము. మన మొగము చూచినవారే యెవ్వరును లేరు. పెండ్లివా రని, యెదురుగ వచ్చుట యని, యాదరించుట యని, యేమైన నున్నదా? పక్షి నదా? కొత్తసంబంధము మన కెందుల కని మొదటనే నిరాకరించినాను. నీవు పట్టుపట్టితివి. అనుభవించు- మంచినీరు మంచినీ రని యెవ్వరి నడుగుదువు? చెట్టుక్రింద తేళ్లో పాములో చెట్టుమీఁద దయ్యములో యెవఁ డెఱుఁగును? దీపము లేదు. ధూపము లేదు. నీకుఁ దగినశాస్తి యయినది. అంతే కావలెను.

వీర—ఎంతసేపు నన్నుమాటలతోడనే సరిపోయినది. నాయుసురుపోసి కొనుటతోడనే సరిపోయినది. వారము లేదు వర్జ్యము లేదు గదా. ముత్తయిదువ నని జ్ఞానమైన లేదుగదా. చెట్టంతదానను. ఊరకే పులిసి దులిపి విడిచిపెట్టుదురుగదా (కన్నీళ్లొత్తుకొనును.)

సీత—అమ్మా! ఊరకుండుము. నాన్న కీదినమునఁ గ్రొత్తయా యేమి! ఈవేళనే తిట్టినాఁడా యేమి ? నేను పుట్టినప్పటినుండి చూచుచున్నాను. తిట్టుట యతనికిఁ బరిపాటి యైపోయినది. ఏడుట నీకుఁ బరిపాటి యైపోయినది. కన్నులొత్తుకొనుట యంతకంటెఁ బరిపాటి యైపోయినది.

వీర—సీతా! నాతప్పేమే? ఈసంబంధమువలన కట్నమెక్కువవచ్చునని మీనాన్న యాశపడి తానే బేరము సాగించుకొన్నారు గాని నే నేమి చేసితిని? అశుభము శుభ మెఱుఁగనిదానను. పుణ్యానికిఁ బాపానికిఁ బోయినదానను గాను. తంగేడుపూఁతలాగున నొడలినిండ నగలుపెట్టుకొని బనారసుకోక కట్టుకొని, గంగాలములాగున నెదురుగ నున్నదానిని- రవంతపరిహాసానికి మీఁదఁ జేయివైతురు, బుగ్గను గంధము రాయుదురు, అంతే కాని శుక్రవారమురాత్రి సూదుమాటలా? నాప్రాణ మెంత కొట్టుకొనిపోవుచున్నదో! (ఏడ్చును.)

కామ—అయ్యో వెఱ్ఱిమొగమా! ఏడ్పెందులకు? పెండ్లివారు రాలేదని వారిమీఁద నేను విసుగుకొనుట యేమి? నీవు బేసమనుట యేమి? సీతా! నీచేతిగుడ్డ యిటుతే.

సీత—నాదగ్గఱ లేదు.

వీర—ఇదిగో నాదగ్గఱదీయవే (ఇచ్చును)

కామ—కన్నులు మూసికో, రవంత తుడుతును. (తుడుచుచు)

వీర—కానంత కాటుకయుఁ దుడిచివేయుదురా యేమి? చాలు.

కామ—కాటుకఁ దుడిచివైచినను గన్నులు నల్లగానే యుండునులే- కాటుకకన్నులదానవు. అదృష్టవంతురాలవు. నే నేమో గట్టి గుండె గలవాఁడ నని నీవనుకొనుచున్నావుకాఁబోలు. నీగుండె

కంటును నాడి తేలగుండె. మొన్న రాత్రి గదిలోనికిఁ బిల్లివచ్చి మినుపసున్ని తినునప్పుడు నీవైనఁ గానంత యదలించితివి కాని నేను నిన్నుఁ గౌఁగిలించుకొని కూరుచుంటినిగాదా? పెదవి యైనఁ గదల్చితినా? కటికచీఁకటిలోఁ జెట్టుక్రింద నూరిబైటఁ గూర్చుంటిమి. దొంగలు వత్తురేమో- నెత్తిమీఁదఁ గొట్టి నీనగ లెత్తుకొని పోవుదురేమో యని నేను మొఱ్ఱో యని దేవులా డుట యేమి? నీవు పులుకు పులుకు కన్నీళ్లొత్తుకొనుట యేమి? వెఱ్ఱిమొగమా! ఊరకుందుము. పెద్దగొంతుకవాఁడను గనుక మాట ఝాంకారమే కాని లోపల నేమైన నున్నదఁటే. వట్టి గుల్లకాదఁటే.

వీర—సీతా! చూడు జగన్నాథము కునికిపాట్లు పడుచున్నాఁడు. తివాచి పఱచి వానిని జోకొట్టవే.

సీత—(అట్లుచేయును.)

కామ—జగన్నాథా! జగ్గన్నబాబూ! పెండ్లివేళ నిద్రపోవుదురా? మీయమ్మ గర్భాధానమునాఁడు నిద్రపోయినదా మఱి?

వీర—చాలులెండు. వేళాకోళాలకిదే వేళా యేమి?

కామ—ఓస్. వెఱ్ఱిమొగమా! ముద్దుముద్దుగా బుజముమీఁదఁ జేయి వైవవలసినది, పలుచ పలుచగా రతంత బుగ్గకు గంధము రా యవలసిన దని నీ విప్పు డనలేదఁటే?

వీర—అప్పుడు కోపము వచ్చినది గనుక వంటినిగాని యెప్పుడదియే పనియా యేమి? సీతా! బాబు నిద్రపోవుచున్నాఁడఁటే.

సీత—ఆ.

కామ—నిద్రపోనీయకే. జగ్గా! జగన్నాథమూర్తీ! నీకుఁ బెండ్లికా దఁటరా బాబూ! నీకు బుల్లిపెండ్లమువచ్చును బాబూ!

వామనగుంటలాడుకోవచ్చును. కుండబంతులాడుకోవచ్చును. ఎంతో చక్కఁగ నొకరినొకరు ముద్దుపెట్టుకోవచ్చును. బాబూ! లే! నిక్షేపములాగున నీడు జోడు సరిపోయినవి. సీతా! చూడవే- ఏదో చప్పుడగుచున్నది.

సీత—అదిగో దీపాలు తీసికొని యెవ్వరో యిటకు వచ్చుచున్నారు.

కామ—వారు పెండ్లివారే. ఇంకను సందేహమేమి?

సీత—అదిగో! పానకపుబిందె పట్టుకొని వచ్చుచున్న ముత్తైదువ. కుసుంబాచీర కట్టుకొన్నది.

కామ—ఒసే చాకలీ! పలుకఁ డేమి?

సీత—నిద్రపోవుచున్నాఁడు.

కామ—చాకలీ! లే-

చాక—(లేచి) ఎందుకుబాబూ!

కామ—ఎందుకా- నీమొగము- నీమోర- పెండ్లివారు వచ్చుచున్నారు. కాగడా వెలిగించు.

చాక—ఆముదములేదు. పెండ్లివారు మన కిచ్చెదరుగనుక నక్కఱలేదని మీరనలేదా బాబూ!

కామ—సరే- పోనీ. నీ వెదురుగఁ బరుగెత్తుకొనిపోయి యింత యాలస్య మేలచేసితిరి, త్వరగ రమ్మని చెప్పు. (చాకలిపోవును.)

(రంగమున కొకప్రక్క పురోహితునితో వెంకటరావు, సుందరమ్మ, కనకమ్మ ప్రవేశింతురు.)

వెం—పురోహితుఁడా! దీపాలు పైకెత్తి పరిశీలింపుము. ఆచెట్టుక్రిందఁ గొంత కదలికగా నున్నది. వారే పెండ్లివారని తోఁచుచున్నది.

పురో—తొందరపడనక్కఱలేదయ్యా! వారు పెండ్లివారే- నే నిదివఱకు చూచి రాలేదా?

చాకలి—(ప్రవేశించి) ఏమిబాబూ! ఇంతయాలస్యము చేసినారు? పెండ్లివారు గంటఁబట్టి కనుపెట్టుకొని యున్నారు. దీపాలు లేవు. ఏమిలేవు. మంచినీళ్ళు లేవు. త్వరగ రమ్మని సెలవిచ్చినారు.

పురో—కనకమ్మా! చప్పుచప్పున నడుగుపెట్టవలయును. సుందరమ్మా! నీవు పెండ్లినడక లప్పుడే నడచుచున్నావేమి?

సుం—మంచినీళ్ళబిందె నీనెత్తిని బెట్టుకో- నేను గబగబ నడతును.

పురో—ఇటు తే. (తీసికొనును.)

(అందఱు తొందరగ నడచుచున్నారు)

కామ—జగ్గబాబూ! లే- లేపవే- సీతా! సిద్ధముగా నున్నావా?

సీత—నేను సిద్ధముగ నుండు టెందులకు?

కామ—అయ్యో! ఏమనుకొన్నావు. అత్తగారిమీఁద బుక్కాచల్లవలెను. (సీతకు బుక్కా యిచ్చును.) ఇదిగో నీవుకూడ బుక్కా తీసికోవలదా- వియ్యపురాలవు నీవే ముఖ్యము. అసలువస్తువు నీవే కాదా? ఈపైదంతా వడ్డీకబ్బులు కాదఁటే. (బుక్కా యిచ్చును.) సీతా! దగ్గఱకు వచ్చుచున్నారు. జాగ్రత్త. పిల్లవానికి మెలఁకువ వచ్చినదా?

సీత—లేదు.

కామ—అయ్యో- లేపు! జగ్గనాన్నా! లే- ఇదిగో నీయత్తగారు మామగారు వచ్చుచున్నారు లే. నాల్గుమాపాయ లిచ్చెదను లేబాబూ!

జగ్గ—(లేచుచున్నాఁడు.) అక్కయ్యయేది?

సీత—ఇదిగో- ఇక్కడ నున్నాను.

జగ్గ—నాగోళికాయలు నీరొండి నున్నవా ?

సీత—ఉన్నవి.

జగ్గ—నా కిప్పుడు కావలెను.

సీత—అబ్బే. పెండ్లిలో గోళికాయ లాడుదురా ? నే నెత్తికొందును రా. (ఎత్తుకొనును.)

(ఉభయపక్షములవారు తారసింతురు. బుక్కా చల్లుకొందురు. బుక్కా–ధూళి లాంతరురంధ్రములనుండి లోనికిఁ బడిన కారణమున నొక్క–దీప మాఱిపోవును.)

వెం—అయ్యో ! దీప మాఱిపోయిన దే-

పురో—ఒక్క–టి చాలు లేవయ్యా- మూఁడునిముసాలలోఁ దెమలువని కొ క్క–టిచాలునయ్యా-

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే.

వెంకటరావుగారూ ! కూరుచుండుఁడు. కనకమ్మా ! భర్తప్రక్కను కూర్చుండుము. కేశవా, నారాయణా, మాధవా, గోవిందా- పృథివ్యాపస్తేజోవాయురాకాశాత్- ఊ- ఊ- శుక్లనామసంవత్సరే- ఫాల్గుణమాసే- శుక్లపక్షే- వాసరస్తు-శుక్రవాసరే- విష్ణునక్షత్రే- శుభనక్షత్రే- శుభయోగే- అయ్యా! కమవియ్యంకుఁడుగారి గోత్ర మేమి ?

వెం—నేను మఱచిపోయినాను. నీ వడుగుము.

పురో—అయ్యా ! వియ్యంకుఁడుగారూ ! మీగోత్రము సెలవిప్పింపవలయును.

రామ—మాది కొమ్ములగోత్రమయ్యా-

వెం—అదేమి- అదేమి- పెండ్లివా రెవ్వరు ?

పురో—అయ్యో! దీనిసిగఁగొయ్య. ఈదీపము మసకగాఁ గనబడుచున్న
ది. అయ్యా! తమ దేగోత్ర మని సెలవిచ్చినారు?

కామ—కొమ్ములగోత్ర మని చెప్పలేదా?

పురో—తమరు వైశ్యరాజులా?

కామ—ఔను. ఈపెండ్లివా రెవ్వరు?

పురో—మేము బ్రాహ్మణులము.

వెం—పురోహితుఁడా! నీకేమి మతిలేదా? ఇక్కడ మనపెండ్లివా
రున్నా రని నీవు చెప్పలేదఁటయ్యా!

పురో—అప్పటి కున్నారయ్యా! ఇప్పు డిచ్చటికిఁ బోయినారో నా
కెట్లు తెలియును?

కామ—మేము దాదాపుగా రెండుగంటలనుండి యిక్కడనే యున్నా
ము. మేముతక్క మఱెవ్వరు లేరు. మీరు మాకొఱకు వచ్చిన
పెండ్లివా రని మేము భ్రాంతిపడి లేచినాము. బుక్కాదండు
గయే కాని యంతకంటె నేమియు లేదు.

వెం--అమాత్రపుదండుగ మాకుమాత్రము కాలేదా? సెట్టిగారూ!
మీ కీయూరఁ బెండ్లికూఁతురువా రెవ్వరయ్యా-

కామ—కొణగళ్లవారు.

పురో—వెంకటరావుగారూ! మనము వచ్చుచుండఁగా సందులోని కూ
రేగుచు నిలాయికట్టలతోఁ బోయినా రే వారే. అయ్యా!
గుప్తగారూ! మీ రిక్కడ నుండక రవంతప్రక్కకుఁ బోయిన
యెడల వారే మీ కగపడుదురు.

కామ—ముహూర్తము సమీపించుచున్నది. కోమటి కైన బాపనవా
ని కైనను బ్రధానమైన దది కాని మఱియొకటి కాదు. అందు
కొఱకు మేమే వారి కెదురుగఁ బోయి త్వరగఁ గలిసికొందుము.

(కోమటిపెండ్లివారు నిష్క్రమించుచుండఁగా)

పురో—(అప) అయ్యా! సెట్టిగారూ! ఈబ్రాహ్మణవివాహమువారు రానియెడల నేను దమవివాహమునకే వచ్చి యన్నియు జాగ్రత్తపెట్టెదను. ఒక్కవేళ వచ్చెద రనుకో- నేను మరిడయ్యశాస్త్రికొడుకను, పెద్దసంభావన కర్హుఁడను. దయయుంపవలెను.

కామ—(అప) బాపనవానికక్కుర్తి పోనిచ్చుకొన్నావుకావు పో.

పురో—(అప) కోమటివాని పిసిఁడిగొట్టుతనము పోనిచ్చుకొన్నావు కావు. పో.

(కోమటిపెండ్లివారు నిష్క్రమింతురు.)

వెం—ఇదేమి. ఈకర్మ మేమి? రవంతతప్పిపోయినది కాని కోమటిపిల్లవానికిఁ గాళ్లుకడిగియుండవలసినది.

పురో—అంతమట్టునకు రానిచ్చెదనా బాబూ! వచ్చినదే యనుకొనుఁడు. మనము వారి కిచ్చిన క్రొత్తబట్టలు లాగుకొని యీచెంబు నాచెంబు వాయించి గెంటివైతును. మీచేయి కోమటి కాలిమీఁదఁ బడినప్పుడు నేను నాచేయి వానిదాఁడమీఁదఁ బెట్టనా? అబ్బో! అంత తిరకాసుపెండ్లిచేయించెద ననుకొంటిరా? ఈనడుమ నేమైన దనుకొన్నారు?

వెం—పనికిమాలినకథలు చెప్పకు. పెండ్లివారు రాలే దని మే మేడ్చుచుండఁగా-

పురో—రాకపోవుటకూడనా? ఎంతమాట!

వెం—ముహూర్తము దాఁటిపోయినపిమ్మట వచ్చిన నేమి లాభము

పురో—ముహూర్త మెన్నఁడు దాఁటిపోదు.

వెం—దాఁటిపోక మనకొఱకు నిలుచునా?

పురో—ఒకటవ న్మెపిలువఅకు కలరావాంతులులాగున గడియగడియ
కు ముహూర్తమున్నది.

వెం—మొదలు వారు వత్తురో రారో?

పురో—రాకపోయినయెడల వారికర్మము కాని మనకేమిలోపము లేదు.

వెం—ఎందుచేత.

పురో—నే నేదో పన్నాగము చేసి యెవరినో యొకపెండ్లికొడుకును
దెచ్చి యీరాత్రి పెండ్లి చేయింపక మానుదునా? నాతమాషా.

వెం—నీవా-పెండ్లికొడుకును స్థిరపఱచి పెండ్లి చేయుట ?

పురో—పిల్లవానిని మీయెదుటఁ బెట్టి మిమ్మొప్పింపలే ననుకొన్నారా?

వెం—ఆమాటలు కట్టిపెట్టుము. మన మిప్పు డేమి చేయవలసినది?

పురో—పెండ్లికొడుకు రాకమానఁడు. ఒకయరగంట హెచ్చుతగ్గు.
అంతేకాని మఱియొకటి కాదు. ఇప్పుడు మనమేమి చేయవల
సిన దనఁగా—మీరిద్దఱు పీఁటలమీఁద నే కూరుచున్నారుకదా!
కేశవా నారాయణా యని అన్నారుకదా! పెండ్లికొడుకు
వచ్చినట్లుగానే భావించి యాపెండ్లికొడుకు స్థానమున నొక
దర్భపుడుకఁ బెట్టి నేను మంత్రము లేకరువుపెట్టుదును. ఆద
ర్భపుడుకకే మీరు కాళ్లుకడిగి పైచి, పంచెలచాపు వక్కడఁ
బెట్టుఁడు. సుఖముగా నే నాబట్టలు కట్టుకొని వెంకటరావుగా
రిచ్చిన ట్లూరంతయుఁ జెప్పుకొందును. మీపని యేదో చూచి
నవెంటనే కోమటి యింటికి సంభావనకుఁ బోయి కన్నుమూసి
తెఱచులోపల వచ్చెదను. నాకు సుఖము. మీకు సుఖము.
ముహూర్తమునకు సరిగా మనము విఘ్నేశ్వరపూజ యారం
భించిన ట్లుందును.

వెం—నీవంటి యుత్తమపురోహితుఁడు మాకు లభించినప్పు డేమి లో

పము? కన్యాప్రదానముఁగూడ దర్భకర్త్రకే చేయింపఁగూడదా?

పురో—అక్కడ నాకు వ్పదుక దయ్యా. అవి పెద్దమంత్రాలు. ఇది వట్టిలౌకికపుఁదంతు. కావున నట్లు చెప్పితిని. వేపాకులతద్దినాలలో భోక్తలస్థానమున దర్భకర్త్రలను సింగారించి వైదికము యథావిధిగ జరిగింతురు కాదా? వైదికముకంటె వివాహ మెక్కువది కాదయ్యా?

వెం—నోరుమూసికో.

పురో—కోపమువద్దు పంతులుగారూ! మనశాఖకానివారైన వేపాకుల దురాచారములు నిందించితిని. మన మామాత్రము పైశాఖవారిని దిట్టుచుండినఁ గాని మనశాఖాభిమానము నిలుపుకోలేము.

వెం—నీవస్సెవెత్తిచదువులు చదువక మన మిక్కడ నుండవలసినదా, యింటికిఁబోవలసినదా చెప్పుము. సుందీ!

కన—నిద్రపోవుచున్నది.

వెం—నీ వేమి చేయుచున్నావు?

కన—ఏమియుఁ బాలుపోక యేడ్చుచున్నాను.

వెం—మనము పెండ్లివారిని దీసికొనివత్తు మని యింటియొద్ద మాయమ్మ నిరీక్షించుచుండును. వీరు సొమ్ముపుచ్చుకొని మోసము చేయరుకదా!

కన—మన మెఱిఁగినవారు కారు. మఱి యేమి చెప్పఁగలము?

(దీపముతో రంగి ప్రవేశించును.)

వెం—రంగీ! నీవు వచ్చితి వేమే.

రం—అమ్మగారు పంపినారు.

వెం—అమ్మగా రెందులకుఁ బంపినా రనియే యడిగితిని.

రం—మి మ్మందఱను వెంటనే యింటికి రమ్మన్నారు.

వెం—ఎందుచేత ?

రం—బంటియొద్దఁబండి యెక్కి యెవ్వరో వచ్చినారు.

వెం—వారు లోనికి వచ్చినారా?

రం—లేదు.

వెం—మాయమ్మ వారితోఁ మాటలాడలేదా?

రం—ఎవరో యేపెద్దమనుష్యులో యని యమ్మగారు సందేహించి నన్నుఁ బోయి మాటలాడు మన్నారు. మీ రెవరని నే నడిగితిని. మ మ్మాదరించుటకు నీవా వచ్చితివి పోపో యన్నారు. మీ బాబును దీసికొనిరమ్మన్నారు. అమ్మగారిసెలవుకూడ నట్లయినది. అందుచే వచ్చినాను.

వెం—వారు పెండ్లివారేమో యని మాయమ్మ సందేహించినదా ?

రం—నాతో నేమియుఁ జెప్పలేదు.

కన—వారు పెండ్లివారులాగున నీకుఁ గనఁబడలేదఁటే.

వెం—పెండ్లివారికి రెండేసితలలు నైదేసి చేతులుండునా?

కన—అది కాదు. వారిచీరలు సింగారాలు వారివైఖరులు వారివాసనలు భేదముగా నుండక తప్పదు.

పురో—వారు పెండ్లివారేనయ్యా. వెనుకకు మరలుదము రండు. సుందరమ్మా ! భుజ మీడ్చికొనిపోవ బిందెమోసితివి. నీళ్లుపాఱఁబోసి వట్టిబిందెను దీసికొనిపోవుదము. అప్పటి యవసరమునుబట్టి చూచుకోవచ్చును.

వెం—లెండు. మంగలీ ! వాయించు. వాయించు.

పురో—మంగలివాఁ డప్పుడే పోయినాఁడు.

వెం—ఎప్పుడు?

పురో—కోమటిపెండ్లికొడుకుతండ్రి యీముండకొడుకునకుఁ గన్ను గీఁటినాఁడు. వాని వెంటనే వాఁడు పోయినాఁడు.

వెం—అప్పుడు నీవు నాతోఁ జెప్పకపోయితివేల?

పురో—శ్రీధాముఁడైన పెండ్లికొడుకే రానప్పుడు నాపౌరోహిత్యమే యక్కఱలేకపోవును గదా! ఇఁక డోలెందులకు? సందేహ మక్కఱలేదు. మీరింటికిఁ జేరునప్పటికి వాఁడు మీయింట సిద్ధముగా నుండునట్లు నేను జేయఁగలను. కోమటిపెండ్లికొడుకు వారికి మేళము లేదుగాదా? అందుచే మనమంగలి వారితోఁ బోయినాఁడు. వానికొకరూపాయి దొరకును. ఇంతకు మన పని చెడలేదు. సర్వే జనాః సుఖినో భవంతు.

వెం—ఆఱిపోయినలాంతరు నేను బుచ్చుకొందును. పురోహితుఁడా! నీవు వెలుగుచున్న దీపముపట్టుకో. సుందీ! బిందె తీసికొనుము. పళ్లెరము పట్టుకొని నీవు రావే ఇందులో నుండవలసిన పంచెలచాపేది?

పురో—పంచెలచాపేమిటి పోవుట యేమిటి?

వెం—ఏమిటి యని యడుగుదు వేమి? నీమొగము. పంచెలచాప నఁగఁ బంచెలచాపు. పోవుట యనగాఁ బోవుట.

పురో—ఔనయ్యా. దర్భయనగా దర్భ యనిన సరిపోవునా? దాని నెవరు హరించినారో చూచుకోవలదా?

వెం—చెప్పకుండఁ బోయిన మంగలివానిపని కాని మఱియొకటి కాదు.

పురో—మంగలియొద్ద చాపులేదు. నేనంతవఱకు నిశ్చయముగాఁ జెప్పఁగలను.

వెం—అట్లయిన నెవరు తీసియుందురని నీయభిప్రాయము?

పురో—మనము బుకాౣలోఁ గొట్టుకొనఁ బ్పుడు దీపమాఱిపోయి నదే. ఆసందడిలోఁ గోమటిపెండ్డివారిచాకలి తీసియుండును— ఇంతలో మనవ్యవహారములు చెడిపోయినవి కావా—వాఁడే కట్టుకొనిపోయి యుండును. చాకలివానికి బట్టవిగాఁదనున్నంతే యేవ మంగలివాని కుండదు.

వెం—సరే. పోవుదము రండు.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది తృతీయాంకము.

శ్రీరామా.

# విచిత్రవివాహము.

## చతుర్థాంకము.

ప్రదేశము—పెండ్లివారియిల్లు.

ప్రవేశము--పురోహితుఁడు, వెంకటరావు, గంగ, సుందరమ్మ, కనకమ్మ, అప్పన్న, భార్య మహాలక్ష్మమ్మ, కొడుకు ధర్మయ్య, వితంతుపుత్రిక చలమమ్మ- కొందఱుభటులు, మంగలి.

పురో—త్వరగ. త్వరగ. అమ్మా కనకమ్మా! పిల్లను బుట్టలోఁ గూరుచుండఁబెట్టితివా ?

కన—ఇంతసేపటినుండి దేవులాడుచున్న దదే కాదా- బుట్టలోఁ గూర్చుండనిదే! ఎన్నివిధాలఁ జెప్పినను నుహు అన్నది. తలకొట్టుకొంటిని. ఊహు.

పురో—పోని అమ్మా! నీవుకూడ బుట్టలోఁ గూరుచుండుము. గౌరీపూజ కావలయును. ఈతంతు ముఖ్యము కాదేమో యిది తీసివేయవలయు నని యాలోచించినాను గాని పెండ్లికూఁతున కైమువతనమున కిది ముఖ్య మని గర్గముశాస్త్రలు చెప్పినాఁడు. అది వీరికు ముఖ్య మని తోఁచినయెడల మీరు కూరుచుండక తప్పదు. మహాలక్ష్మమ్మగారూ! పెండ్లికొడుకునకు మంగళస్నానము చేయించినారా ?

మహా—లేదు. నా కిప్పుడు స్నానమక్కఱలేదని పిల్లవాఁడు వెంకి పట్టుపట్టి కూరుచుండినాఁడు.

పురో—ఇప్పుడు వెంకిపట్లు చూడఁగూడదు. ఏడ్చినసరే మొత్తుకొన్న సరే కట్టగట్టి నీళ్ళలో ముంచి తీసికొని రండు. స్నానము లేకుండఁ జల్దియన్నము తినవచ్చును. క్షౌరము చేయించుకొన వచ్చును. అంతేకాని స్నానములేకుండఁ బెండ్లియే! కనకమ్మా! గౌరీపూజకు లోనికిరా. (ఇద్దఱు నిష్క్రమింతురు.)

మహా—నాయనా! ధర్మయ్యా! తల యంటెదను. చప్పన నీళ్ళు పోసెదను రా నాయనా!

ధర్మ—నేను నీళ్ళు పోసికోను. పోసికోను. పోసికోను.

మహా—పోసికోవు. పోసికోక పోవుట యేమి తెగులురా. పొగరుఁ బోతా. (వీపుమీఁదఁ గొట్టుచున్నది.)

అప్ప—పిల్లవానిని శాంతిపఱతురుకాని కొట్టుదురా?

మహా—ఎంతజెప్పినను వినవిడే యెక్కడఁ బావను? నాపిల్లవాఁడు నామాట వినకున్నయెడల నా కేడ్పు రాదా?

అప్ప—(అప) అయ్యయ్యో! ఏడువకు. బాగుగా నుండదు.

మహా—మీరు గోళ్లుగిల్లుకొనుచు నిలుచుండక వానికి రవంత బోధింప లేకపోయినారా? (ఏడ్చుచుండఁగనే పిల్లవానిని దొడిలోనికిఁ దీసికొనిపోవును.)

అప్ప—వెంకటరావుబావగారూ! కట్నముపొమ్ములో సగమే యిచ్చి నారు. తక్కిన దిప్పు డిచ్చివేయుటయే కాదా?

వెం—వివాహకాలము దిచ్చెదనుగాదా!

అప్ప—అత్తయాఁడుబిడ్డలలాంఛనములమాటకూడ నప్పుడే చూచెదరు కాఁబోలు.

వెం——అలాగే. ఒప్పుకొన్న తరువాతఁ దప్పునా ?

(నేపథ్యమున)

ఇక్కడ గౌరీపూజ జరుగుచున్నది. త్వరలో వచ్చుచున్నాను. పెండ్లికొడుకు మంగళస్నానమైనదా ? చప్పునఁ దెమల్పవలయును. ఆలస్యమన్నమాట పనికిరాదు.

వెం---నీవక్కడనుండి కేకలువైచుట కాదయ్యా. చప్పున వచ్చి యిక్కడిపను లన్నియుఁ జూడవలెను.

పురో---(ప్రవేశించి) (పీఁటలువేసి ప్రయత్నమంతయుఁ జేయును.) వెంకటరావుగారూ ! మీరు ముందుగాఁ బీఁటమీఁదఁ గూరుచుండుఁడు.

వెం---(కూరుచుండి) ధర్మపత్నీసమేతస్య యని సంకల్పమున్నదికదా. ఆమె రాకుండ నేలాగు ?

పురో---ఆమె వచ్చినయెడలఁ బిల్ల యొక్కతెయు బుట్టలోఁ గూర్చుండదు. పిల్ల నిప్పు డీవలకుఁ దీసికొనిరాఁగూడదు. ఏమిచేయుదుము ? ఏతట్టలోనైనను భార్య యింటిలో నున్నది కాదా ? పొరుగూర నుండఁగూడ దని వేదర్షులయభిప్రాయము కాని మఱియొకటి కాదయ్యా.

వెం---ఆమె నాచేతిలో నీరుపోయవలయునుగాదా ?

పురో---నేను జోసెదనయ్యా. ఏలాగో సర్దుకొనక పోయినయెడల నెట్లు ? నే నింకొకమార్గము చెప్పనా ? మీతల్లిగారిని బిల్లతోఁ దట్టలోఁ గూరుచుండఁబెట్టినయెడల—

వెం---చీచీ. ఏతంతువునాఁడిలోఁ బిల్లను గూరుచుండఁబెట్టి గౌరీపూజఁ జేయింతువఁటయ్యా !

పురో---అయ్యా ! ఏఁబదియేండ్లు దాఁటినవిధవ పుణ్యస్త్రీతో సమా

సురాలయ్యా. అనాథసంబంధమైన దోషమంతయు నర్థశతాబ్దములోపలనే. ఎందుచేత ననఁగా, స్త్రీలకు ఋతుసంబంధమైన దోష మేఁబదిలోఁ గట్టువడును. అది యెప్పుడు కట్టువడినదో యప్పుడు కన్యాత్వ మన్నమాటయే. కన్య యనునది సువాసినియే కాదా ?

వెం—ఏడ్చినట్లే యున్నది. (దొడ్డిలో నేడ్పు వినఁబడుచున్నది.)

అప్ప—అయ్యయ్యో! అదియేమి? నాభార్య యేడ్పువినఁబడుచున్నది! (దొడ్డిలోనికిఁ జలమమ్మతో నిష్క్రమించును.)

పురో—సంకల్పము చేసిన తరువాత మీరు కదలఁగూడదు. మమ అనుకొనుఁడు.

వెం—నీ మమ కాలిపోను! ఏమి పుట్టిమునిఁగినదో? అక్కడ వియ్యపురాలేడ్చుచున్నది. (నిష్క్రమించును.)

పురో—(తనలో) ఈసమయములోఁ గోమటియింటికిఁ బోయి సంభావన తెచ్చుకొన్నయెడల బాగుగ నుండును. (ప్రకా) సుందరమ్మా! దొడ్డిలో గడబిడ యేమి?

సుం—నూతియొద్ద ప్రాఁకుడున్నది. వియ్యపురాలు జాఱిపడినదేమో!

పురో—అమ్మా! కనకమ్మా! ఏమైన సరే. వియ్యపురాలి నడుము విఱిఁగినసరే. మీరు బుట్టలోనుండి కదలఁగూడదు. గౌరీపూజకు విఘ్నము రాఁగూడదు.

(వెంకటరావు, అప్పన్న ప్రవేశింతురు.)

వెం—మతేమియుఁ దొందరలేదు. పెండ్లికొడుకు విశేషముగా నేడ్చునప్పుడు గబగబ నీళ్లు పోయుటచేత నుక్కిరిబిక్కిరియై కొయ్యబాఱిపోయినాఁడు.

అప్ప—మఱేమియుఁ దొందర లేదు. ఇప్పుడు నిక్షేపములాగునే నున్నాఁడు.

(మహాలక్ష్మి పెండ్లికొడుకు నెత్తుకొని ప్రవేశించును.)

పురో—అమ్మా! పిల్లవాఁడు క్షేమముగా నున్నాఁడా?

మహా—ఆ.

పురో—పోని అమ్మా! మంగళస్నానాలలోనే లబాయి దిబాయి లగుటచే నడుము లొటుక్కు మన్నది. నేను బ్రహ్మాసనము వేసిన చోట నెక్కడను దేఁడారాదు. నూటికిఁ గోటికి వచ్చునెడల సంవత్సరము దాఁటిపోయినపిమ్మట రావలయునేమో కాని యీలోపల రాదు. అమ్మా! మీస్నానమైనదా?

మహా—ఎక్కడనైనది?

పురో—అయ్యయ్యో! త్వరగఁ బోయి స్నానముచేసి రండు. పిల్లవానిని తండ్రియొద్ద నుంపుఁడు.

మహా—(పోవును.)

పురో—సుందరమ్మా! పోనీ-నీవెందులకు? అప్పన్నగారూ! మీకుమార్తెను బిలిపింపుఁడు.

అప్ప—చలమమ్మా!

చల—(ప్రవేశించి) ఎందులకు?

పురో—వచ్చినావా? చలమమ్మా! పెండ్లికొడుకునకుఁ గల్యాణము బొట్టువెట్టి రవంత పారాణి కాళ్లకుఁ బెట్టు.

అప్ప—ఆమె యిల్లుపట్టిన కుఱ్ఱదికాదా? మఱియెట్లు? మాకోడలు సుందరమ్మతోఁ జెప్పఁబోయి మీరు సందేహించిన దందులకే కాదా?

పురో—వితంతువైన నేమి ముక్కుపచ్చలారనికుఱ్ఱది. చూచినారా-

ఎక్కడను వితంతులక్షణమే యగపడదు. ఇంతకు మనకుఁ బ్రధానమైనవి శిరోజములు. అవి సందేఁ దున్నవి. సందేహింప కుఁడు. చలమమ్మా! కానీ-

చల—(పెండ్లికొడుకున కట్లు చేయును.)

పురో—మహాలక్ష్మమ్మా! త్వరగ రావలెను-సుందరమ్మా!

సుం—ఎందుకు?

పురో—మహాలక్ష్మమ్మను స్నానము నిముసములోఁ దెమల్చుకొని రమ్మనుము. పెద్దపులిలాగునముహూర్తము సమీపించు చున్నది.

సుం—వదిన తట్టలోఁ గూరుచుండలేక సకలబాధలు పడుచున్నది. చప్పునఁ దెమల్ప రాదా?

పురో—ఇంతయేసు పందుకొలకే కాదా? అదిగో వియ్యపురాలు వచ్చినది. (మహాలక్ష్మి ప్రవేశించును.) అమ్మా! పిల్లవాని నీ యెదుటపీఁటమీఁదఁ గూరుచుండఁబెట్టుఁడు.

మహా—రా నాయనా! ఇదిగో ఈపీఁటమీఁదఁ గూరుచుండుము.

ధర్మ—నీవు కూర్చుండినఁగాని కూర్చుండను.

పురో—మీరుగూడఁ గూర్చుండుఁడు—నాయనా! ధర్మయ్యా! ఈనీరు నోటిలోఁ బోసికో. కేశవ, నారాయణ, మాధవ, గోవింద, విష్ణు......ఊ. ఊ. కృష్ణార్పణం. డోలువాయించరా లంజ కొడుకా! వెంకటరావుగారూ! పెండ్లికొడుకుకాళులుకడుగుఁడు.

వెం—నాభార్య నాచేతిలో నీళ్లుపోయుచుండఁగా నేను గడుగవల యునుగాదా?

పురో—నేనే ధర్మపత్నిని-కానీవయ్యా.

గం—ఆలాగునఁ బనికిరాదయ్యా. కనకమ్మ రావలెను. నాపెండ్లి కేలాగున జరిగినదో యాలాగుననే జరుగవలెను.

పు—తథాస్తు! (తనలో) నీలాగుననే విధవకావలయు నని మనుమరా
లికి వరమిచ్చుచున్నావా మాతల్లీ-

సుం—పెండ్లికూఁతురు నిద్రపోవుచున్నది కనుక మావదినె యిఁక
రావచ్చును. నే నక్కడఁ గూరుచుండి మావదినెను బంపు
దును.

పురో—నీవు తట్టలోమాత్రము కూరుచుండకుమా-

సుం—(తనలో) ఒకసారి కూరుచుండి యింతసౌఖ్య మనుభవించుచు
న్నాను. ఇఁక రెండవసారియా? (నిష్క్రమించును.)

(కనకమ్మ ప్రవేశించును.)

పురో—వచ్చితివా మాతల్లీ! భర్తచేతిలో నీళ్ళు పోయుము. (ఆమె
యట్లు చేయును. వెంకటరావు కాళ్ళు కడుగును.) ఆనీళ్ళు
తలపైఁ జల్లుకొనుఁడు. (వారట్లు చేయుదురు) విప్రపాదవిని
ర్ముక్తం తోయం శిరసి ధారయా-

అప్ప—అదేమి? తద్దినపుమంత్రములోనిది చదివెదవేమి?

పురో—ఉండవయ్యా! నీకెందులకు? తద్దినమంత్ర మనఁగా నంతపని
కిరాలిన దనుకొనుచున్నావా? అవియు వేదమంత్రములే
నయ్యా. మనకు శుభాశుభముల రెంటికిఁగూడ దర్భలు తండు
లములు, కుండలు, మూకుళ్ళుతప్పవయ్యా-అన్నియు వేదమం
త్రములేనయ్యా. అయాసంధులందుఁ గప్పదాట్లు వేయకుండఁ
జూచుకోవలయునుగాని—

అప్ప—ఆలాగునఁ జూచుకోవలయు ననియే చెప్పుచున్నాను.

పురో—ఈమొక్కచేతిమీఁదుగా నీనెలలో రెండువందలపదునాల్గు పెం
డ్లిండ్లుచేయించినాను.

అప్ప—ఈమొక్కనోటితో నే నీనెలలో మూడువందలగిన్నెల కాఫీ

తాఁగినాను. సంఖ్యచెప్పి సంతోషింపవలదయ్యా. వియ్యంకు
డుగారూ! నాకు జ్ఞప్తికి వచ్చినది—కట్నమెప్పుడుచదివింతురో
పురోహితు నడిగి యాయవశిష్టము తీర్చుకొనుట మంచిది
కాదా?

పురో—అది సర్వోత్తమ మైనపని.

వెం—ఇదిగో. ఇక్కడనే సిద్ధముగా నున్నది. తీసికొనుఁడు (ఇచ్చును.
అప్పన్న తీసికొనును.)

పురో—కనకమ్మగారూ! అఁడుబిడ్డ వియ్యపురాలి కట్నములు మీరిం
డు. మహాలక్ష్మమ్మగారూ, చలమమ్మగారూ మీ లిట్లు తంతు.
తెలిపి వైపోవుట యెల్లమంచిది. ఎవరిసొమ్మెవరి కెంత
ప్రాప్తిరో యంతయు వారియొడిలోఁ బడక తప్పదు. ఈఋ
ణానుబంధ మెంత శీఘ్రముగఁ దెగతెంపుచేసికొన్న నంత
మంచిది.

కన—వదినా! ఇదిగో నీకట్నము. కోడలా! ఇదిగో నీకట్నము. అమ్మా!
సరిగా లెక్కచూచుకొనుఁడు.

మహా—వదినా! మీరు తక్కువయిచ్చెదరా యేమి? లెక్క యక్క
ఱలేదమ్మా.

పురో—ఆలా గనవలదు. సొమ్ముతోఁ బని. ఈనడుమ నల్లచెఱువుసత్ర
ములో నేమైన దనుకొన్నారు! పెండ్లికొడుకువారికి మూఁడు
వేలుకట్నమిచ్చుట కేర్పాటు-ఒకసంచిముందు చేతిలోఁ బెట్టినారు.
పెండ్లికొడుకుతండ్రి ఆసంచిలెక్కసరిగాఁ జూచుకొని తనవెను
కనున్న భటున కిచ్చినాఁడు. ఇంతలో రెండవసంచి వచ్చినది.
అదియు లెక్కపెట్టుకొన్నాఁడు. వెనుకటియట్లే భటునిచేతి
కిచ్చినాఁడు. ఇట్లే మూఁడవపర్యాయ మైనది. మీకు ముట్టె

నట్లు మాకుఁ గాగితము వ్రాసి యిమ్మని పెండ్లికూఁతురుతండ్రి పెండ్లికొడుకుతండ్రి నడిగినాఁడు. ఆతఁ డట్లు వ్రాసి యిచ్చి నాఁడు. పెండ్లి యైపోయినది-కట్నపుసంచులు మూఁడు కనఁ బడ లేదు.

అప్ప—అ దెందుచేత ?

పురో—పెండ్లికూఁతురుతండ్రి పెండ్లికొడుకుతండ్రి వెనుక నున్నభటు నితో స్వల్పమైన యేర్పాటు చేసికొన్నాఁడు. ఆయేర్పాటు ప్రకారము భటుఁ డేమి చేసినాఁ డనఁగాఁ దనయొద్దకు సంచి రాఁగనే యాసంచి పెండ్లికూఁతురుతండ్రిచేతికి రహస్యముగ నందిచ్చెడువాఁడు. ఆసంచియే రెండవసంచిగా వియ్యంకుని యెదుట నిల్చినది. అదియే మూఁడవసంచిగాఁ దిరిగి వియ్యం కుని యెదుట నవతరించినది. ఇట్లు రెండావృతులు తిరిగి యా సంచి పెండ్లికూఁతురుతండ్రి పెట్టెలోని కంతర్ధానమైనది. ఇంత పనిచేసినందుల కాభటుఁ డైదువందలరూపాయలు పెండ్లికూతు రుతండ్రియొద్దనుండి తీసికొన్నాఁడు—కాళ్ళకడుగుట యైపోయి నదికదా—కట్న మైపోయినదికదా-వెంకటరావుగారూ! పెండ్లి కొడుకునకు బట్ట లీయవలయును.

వెం—(అతనిచేతిలోఁ బెట్టును.)

ధర్మ—అమ్మా! నీవుకట్టుకో.

మహా—నాయనా! నేను మగవారిబట్టలు కట్టుకోఁగూడదు తప్పు.

పురో—ఇఁకను బెండ్లికూఁతును దీసికొనిరావలెను. అమ్మా! మీరు త్వరను దెత్తురా ?

వెం— నేను దీసికొనివత్తును.

కన—తట్ట భద్రముగాఁ దీసికొని రావలెను. పిల్ల నిద్రపోవుచున్నది. లేచినట్లయ్యెనా ఏడ్చును. అది యపశకునముగా నుండును.

వెం—(లోనికిఁ బోవును)

పురో—అమ్మా! పిల్లలయేడు పెన్నఁడు నపశకునము కాదు. లోపల దుఃఖమున్న యేడుపైన నది యపశకునము.పిల్లవాని యేడ్పునకుఁ బిల్లతనమే కారణముగాని దుఃఖము కాదు. అది వారికి సహజము. పిల్లి మేవు మనుట యెట్టిదో పిల్లవాఁడు కేరుమనుట యట్టిది.

వెం—(లోనుండి) పిల్లను దీసికొని రావచ్చునా ?

పురో—ఇదిగో తెర కట్టుచున్నాను. ఒక్కనిముసము- సుందరమ్మా. చలమమ్మా! మీ రెవ్వరు నెదురుగా వెళ్లఁగూడను. పెద్దది కావున గంగమ్మ కిబ్బంది లేదులే.

(వెంకటరావు తట్టతోఁ బిల్లను దీసికొనివచ్చును. పిల్లనిద్రి పోవుచుండును)

పురో—వాయింపరా-వాయింపరా. పిల్ల నిద్రిపోవుచున్నదే. పిల్లచేత జీలకర్ర బెల్లము పెండ్లికొడుకుతలపైఁ బెట్టింపవలయునుగాదా. ఎట్లా యని చూచుచున్నాను. ఈరాత్రి ముహూర్తాలు మిక్కిలి యసదుపాయము లైనవి. రాత్రిముహూర్తా లెల్లగర్భాధానపుఁ బిల్లలకు వసతి కాని పెండ్లిపిల్లలకుఁ బనికిరావు.

వెం—పోనీ లేపరాదా ?

కన—(అప) లేపవచ్చును. లేచినవెంటనే యేడు పారంభించును. పిల్లలయేడ్పు మంచిదే యని పురోహితుఁడు చెప్పినాఁడు. ఆలాగే యనుకొందము. లేవఁగానే పాలీయు మని చంపును. ఇందటి లో నే నీయలేను.

పురో—అమ్మా! మీసందేహ మేదో నాతోఁ జెప్పరాదా? పిల్లదాని నిప్పుడే లేపవలదు. తలఁబ్రాలవేళ లేపుదము. ఆసందడిలో నేద్వారుండ నుండును. ఇదిగో జీలకఱ్ఱ బెల్లము. ఇది మీరు చేతఁ బుచ్చుకొని పిల్లదానికుడిచేతిని మీయెడమచేతితోఁ బట్టుకొని పెండ్లికొడుకునెత్తిపైఁ బెట్టవలెను. నేను సమయము చెప్పెదను. అప్పుడు పెట్టవలయును. ధర్మయ్యబాబూ! నీచేతికి జీలకఱ్ఱ బెల్ల మిచ్చెదను. నీవు పెండ్లికూఁతు నెత్తిమీఁదఁ బెట్టఁగలవా?

ధర్మ—ఆ.

పురో—ఏమమ్మా మహాలక్ష్మమ్మా! పెండ్లికొడుకుచేతి కీయునా మీరే పెట్టుదురా.

మహా—నేను బెట్టుటెందులకు వాఁడే పెట్టును.

పురో—ఇదిగో ధర్మారావు. ఇది నీచేతిలోఁ బెట్టికొనుము.

ధర్మ—(పుచ్చుకొనును.)

పురో—వాయింపరా-వాయింపరా. సరే-సరే-ఇఁక పెట్టవచ్చును.

కన—పెండ్లికూఁతురు తలపై బెల్లపుముద్ద లేదేమి?

మహా—ఏమి నాయనా! నీచేతి కిచ్చినయుండ యెక్కడ నున్నది?

ధర్మ—ఇదిగో నానోటిలో నున్నది ఆ—ఆ—

పురో—ఈబెల్లపుకూడికచే నింత పుట్టి మునిఁగినది. పిల్లలపెండ్లిండ్లలో బెల్లపుఁగూడిక యుండఁగూడదు. వేదర్షులు దూరదృష్టి లేక బెల్ల మిందులోఁ జేర్చినారు. వెల్లుల్లిపాయలతో జీలకఱ్ఱను నూఱి నెత్తిని బెట్టు మని వారు శాసింపవలసినది. పెండ్లికొడుకు మ్రింగివేయు నను జ్ఞానము వారికి లేకపోయెను.

అప్ప—బ్రహ్మగారూ! ఇఁకను మ్రింగ లేదు. చప్పరించుచున్నాఁడు.

పురో—ఎంగిలిది పెండ్లికూఁతుపైఁ బెట్టి తురా?

అప్ప—నీకు నాకు నెంగిలి గాని భార్యాభర్తల కేమున్నది?

పురో—అట్లయిన మీరు నోటిలోఁ జేయిపెట్టితీయుఁడు. పౌరోహిత్య పుఁగాసునకై వచ్చిన ముండకొడుకను. నా ప్రేళ్లు కఱచిన యెడల నేను జచ్చెదను. మీ కేమి? రెండుమూఁడు వేలు సం పాదించుకొన్నారు కావున నొక్క వేలుపోయినను గణన లేదు.

వెం—సరే. జరిగిన దేదో జరిగినది. మనమిప్పు డీలోపము తీరుట కేమి చేయవలసినది?

పురో—వేదజ్ఞులే యీవిషయ మాలోచింపనప్పుడు ధర్మశాస్త్రకా రుల కీసంగతి తోఁచియేన్చునా? మీయల్లుఁడు శాస్త్రులకు వేదాలకు లొంగనిపని చేసినాఁడు. పిల్లవాండ్రచేష్ట లీరాకడ గా వచ్చునని బ్రహ్మదేవుఁడే చెప్పలేనప్పుడు వేదజ్ఞుల లెక్క యేమి?

వెం—ఊరకే చదివెద వెందులకు? ఈలోపము తీరుట కేమి చేయ వలయు నని యడిగితిని.

పురో—పిల్లవాని నెత్తిమీఁద నున్నముద్దలో సగము తీసి పిల్లదాని తలపైఁ బెట్టింపవలసినది.

వెం—ఎవరిచేతఁ బెట్టింపు మంటివి?

పురో—అక్కడ సందేహము పట్టుకొన్నదా యేమి? ఇన్నివిధములు గాఁ దప్పుదారులు త్రొక్కినతంత్రమునం దింక సందేహ మెం దులకు? ఎవరిచేతఁ బెట్టించినను సరే.

వెం—(తనభార్యచేతనే పెట్టించును.)

పురో—ఇఁకఁ దలఁబ్రాలు పోయింపవలెను. ఇప్పుడు పెండ్లికూఁతు ను లేపక తప్పదు. పిల్లను నిమ్మళముగ లేపుఁడు.

కన—అమ్మా! దమయంతీ! (లేపుచున్నది.)

పురో—దమయంతి యన్నది మంచిపేరే. పురాణస్థ మైనది. దమయంతి యనఁగా రావణాసురునిభార్య గాదా?

అప్ప—చీ చీ! రావణాసురునిభార్య మందోదరి.

పురో—సరి. సరి. ఈసారి జ్ఞప్తికివచ్చినది. అదిగో! అది! హరిశ్చంద్రుని భార్య యన్నమాట. మీకుఁ బౌరోహిత్యముచేయువాఁడనైనను నామకరణసమయమున నేను లేనికారణమున నెఱుఁగను. బుజ్జీ యను ముద్దుపేరే నే నెఱుఁగుదునుగాని—

వెం—లేనిపోనిమాటలు చెప్పి యాలస్యముచేయుచున్నావు. సుముహూర్తము దాఁటిపోవునేమో!

పురో—అల్లుఁడుగారు చప్పరించినదే సుముహూర్తము. అది యయియేపోయినది. ఇంక మనమెంత నిదానముగా నైనఁ జేసికొనవచ్చును. తలఁబ్రాలుమాత్రము వెంటనే జరుగవలసియున్నది. కనకమ్మగారూ! పిల్ల లేచినదా?

దమ—(లేచి) అమ్మా! బాయి. అమ్మా! బాయి.

పురో—మహాజనులారా! నవ్వకుఁడు. అది పిల్లలకు సహజము. మనమందఱ మట్లుచేసినవారమే. స్త్రీయే ప్రపంచమునకు మూలాధార మని నమ్మవలెను.

వెం—నీయిల్లు బంగారముగాను. ఇప్పు డుపన్యాస మారంభించితి వేమి?

దమ—అమ్మా! బాయి.

కన—నోరుమూసికో. ఇప్పుడు కాదు. ఇప్పుడు కాదు.

దమ—ఆ. ఆ. ఏ. ఏ. (ఏడ్చును.)

సుం—(దగ్గఱకు వచ్చి) బొయిలేదు. హాష్ కాకీ- కాకి యెత్తుకొనిపో యినది.

దమ—ఇదిగో. ఇదిగో. (చూపును.)

పురో—పిల్లల కున్నంత సూక్ష్మదృష్టి పెద్దవారికి లేదు.

కన—నోరుమూసెదవా? వేసెయనా? (పీఁపుపై నొక్కటికొట్టును.)

దమ—(విశేషముగా నేడ్చుచున్నది)

గం—(అప) వంటయింటిలోనికిఁ దీసికొనిపోయి రవంత నములఁబెట్ట రాదఁటే.

పు—వంటయిల్లు పనికిరాదు. ఊరుఁగాయలకొట్టు పనికిరాదు. ఇక్కడ నుండి కదలుటకు శాస్త్ర మంగీకరింపదు. నేనొకయుపాయము చేసెదను. ఓమహాజనులారా! మీరు రవంతసేపు కనులు మూసికొనుఁడు. పెండ్లికూఁతునకుఁ దల్లి పాలిచ్చును.

వెం—పనికిమాలినచదువు చదువకయ్యా! అన్నియు నీకే కావల యును.

పురో—పురోహితున కామాత్రపుఁగలసికట్టుఁదనముండనియెడల నే లాగు? నెత్తిమీఁదిబెల్లము దీసి రవంత నోటఁబెట్టుమమ్మా- పిల్ల యేడ్పునకు బెల్లమంత దుఠాకట్టు లేదమ్మా! అసలు పిల్ల శబ్దమే బెల్లములోనుఁడి వచ్చిన దని పరిషన్నిఘంటువులో వ్రాయఁదలఁచుకొన్నట్లు విన్నాను.

అప్ప—సీధారణి బంగారముగాను. పరిణయమంత్రములోఁ బరిషన్ని ఘంటువుగొడవ యెందులకయ్యా! తరువాతఁ గానిండు.

పురో—తలగొట్టకొని పిల్ల యేడ్చుచుండఁగాఁ దలఁబ్రా లెందులకు? ఈ యేడ పేదో చల్లారినతరువాతఁ జూచుకొనవచ్చును. పడ్చి

గోష్ఠి పెండ్లికొడుకింతకుముందే కాదా కొయ్యవాటివాఁడు.
ఈపిల్లసంగతి కాసంత నిదానింపఁ దగ్గదికాదా?

కన—ఈయేడు పింతట మానునా? కానీ- తలఁబ్రాలుకానీ.

పురో—ధర్మారావ్గారూ! ఇదిగో తలఁబ్రాలు. ఇవి పెండ్లికూఁతు తల మీఁదఁ బోయవలెను. బెల్లపుముద్దలాగున నోటిలో వేసికొకు సుమా.

పుహా—నాయనా! పాపాయిని జూచినావా? ఆపాపాయి యేలా గేడ్చుచున్నదో- నీవు బుద్ధిమంతుఁడవు. ఇదిగో. ఇవి ఆపాపాయి నెత్తిమీఁదఁ బోయకోయి నాయనా! నేను బోయింతునులే.

(తల్లిసాయమునఁ బోయును.)

పురో—కనకమ్మా! ఇదిగో తలఁబ్రాలు. పిల్లచేతిలోఁ బోసి పెండ్లికొడుకుమీఁదఁ బోయింపుము.

కన—దమయంతీ! అదిగో బావ. నీ వేడ్చుచున్నావని యేలాగున నవ్వుచున్నాఁడో. నీమీఁదఁ దలఁబ్రాలు పోసినాఁడు. నీవు కూడ బావతలమీఁదఁ బోయుము. (పిల్లచేతఁ బోయించును.)

పురో—అదిగో! అది బాగుగా నున్నది! బావ నీవు నాడుకొందురా? అమ్మా! బావ బటానీలు తీసికొనివచ్చును. నీవు బెల్లము తీసికొనిరా—

కన—అమ్మా తిరిగిపోయుము. బావ చూచితివా ఎట్లు పోయుచున్నాఁడో!

దమ—ఊహూ.

పురో—బుజ్జీ! బావమీఁద లక్కపిడతలోఁ బోయుదువా? సుందరమ్మా! లక్కపిడతతే.

సుం—(అట్లు చేయును.)

విష్ణు—(లక్కపిడుతలోఁ బోయును.)

ధర్మ—(తల్లిసాయమునఁ బోయును.)

పురో—ఈసారి బాగుగా నున్నది. పిల్లలపెండ్లిలోనున్న సొగసు పెద్దవాండ్రపెండ్లిలో లేదు. పెద్దవాండ్రైనయెడల రవంతసిగ్గు రవంతచాటని యున్నది. పిల్లలవేడుకలు ధారాళముగా వికాసముగా నుండును. ఇఁక మంగళసూత్రధారణమే మిగిలియున్నది. అదికూడఁ గానిచ్చెదను.

(మంగళసూత్రము నందఱిచేత స్పృశింపఁజేయును.)

ఉన్న యొక్క ముండకొడుకుకూడ వాయింపఁడేమి? వాయింపరా. (మంగళసూత్రము పిల్లవానిచేతిలోఁ బెట్టఁబోవుచు) ఇదేమి? అయ్యయ్యో! హోమాగ్ని చుయ్యి మని యారిపోవుచున్నదే. అయ్యో నాకర్మము. పెండ్లికొడుకు కొరటికి వెళ్ళుచున్నాఁడు. మహాలక్ష్మమ్మా! తీయవమ్మా. ఆయతుతల మూకిటిలోనైనఁ బోయింపవమ్మా. అదియైనఁ గొంత నయము. అయ్యయ్యో! పవిత్రమైన త్రేతాగ్నుల కెంత ప్రారబ్ధము పట్టినది! మూత్రముచే నివి యిట్లు మూలచ్ఛేద మగుట యెక్కడనుగవలేదు. విన లేదు. ఏయుగములోను నింతదారుణమైన పని జరుగలేదు. ఓయగ్నిదేవుఁడా! నీకర్మ మిట్లు గడ్డైపోయినది. హవ్యవాహనుఁడ వైన నీ విందలిహవ్యములను దేవతల కేమొగముపెట్టుకొని యిచ్చెదవు? కుక్క ముట్టుకొని పోయినకంటె నవకతవకపని జరిగినదే. అయ్యో! వెంకటరావుగారూ! మీరు ఋగ్వేదులు. మీ కగ్ని లాఱిపోఁగూడదు. ఇంక రవంతనెఱి సెక్కపనైన నున్నదేమో. చప్పున సప్తపాదాలు త్రొక్కుఁడు.

(మహాలక్ష్మి కొడుకును దింపి యగ్నిచుట్టు నడపించుచున్నది. కనకమ్మ తనకూఁతు నట్లే నడపించుచున్నది. పురోహితుఁడు వారితోఁగూడ నడచును.)

**పురో**—అమ్మయ్యో! చచ్చితిని. నాకాలు ద్రొక్కితివమ్మా.

**మహా**—చూడలేదు.

**పురో**—చూచి త్రొక్కితి వని యనుకొనలేదు. శతంజీవ. (ఆశీర్వచనము చదువును.) కనకమ్మా! మంగళపుటారతి దెమ్మా.

**కన**—(తెచ్చి పాడును.)

**పురో**—ఇఁకను జాము రాత్రి యున్నది. పండుకొనవచ్చును. నేను నాయింటికిఁ బోదును.

**అప్ప**—ఓరి నీపౌరోహిత్యము బుగ్గిగాను. ఒక్కమంత్రమైనఁ జదువకుండఁ బెండ్లి వెడలఁబుచ్చితివే!

**పురో**—ఛోలుముండకొడు కొక్కఁడు. వాఁడైనఁ దిన్నఁగ వాయింపలేదు. అందుచేత నామంత్రలోపము మీకు వెల్లడియైనది కాని యన్నిపెండ్లిండ్లలో నిదియే వరుస. ఆశ్రితుఁడను. అనుగ్రహపాత్రుఁడను.

**వెం**—ఒక్కనిద్రపోవుట కింకను వేళ యున్నది కానఁ బోవుదము.

**పురో**—నేనొక్క కునుకు దీసి వత్తును.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము.

---

శ్రీరామా.

# విచిత్రవివాహము.

## పంచమాంకము.

ప్రదేశము——పెండ్లివారియిల్లు.

ప్రవేశము——పురోహితుఁడు.

పురో—ఎంతపని జరిగినది! ఎంతవిరుద్ధము జరిగినది! ఆహా! ప్రపంచమునఁ బెండ్లితంత్ర మారంభమైనతరువాత నింతయపకతవక జరిగియుండలేదే? అయ్యయ్యో! ఇంటికిఁ బోయి పంచెను విడిచి చిన్నయంగవస్త్రమును గట్టుకొనుటకుఁ బ్రయత్నించుచుండఁగా గిల్లుమ. రొండినుండి మంగళసూత్రములు రాలినవి. మంగళసూత్రధారణము చేయించుట మఱచిపోయితి నని యప్పు డను కొంటిని. అల్పాచమనకర్మముచే నగ్నులు చల్లారిపోయినప్పుడు దడఁకు పోయినట్లే నాకును మతిపోయినది. మనుమునకు మంగళసూత్రధారణమే మినహాయింపా! ఎంతపని! ఎంతపని! పెండ్లికొడుకు జీలకఱ్ఱ బెల్లము నోటఁ బెట్టుకొన్నప్పుడు వేదశాస్త్రాల కంకనిపని జరిగినదని యాంతనిఁ దిట్టితిని. అట్టివాఁడే యల్పాచమనతంత్రముచేత నంతకంటె నెక్కువపని చేసినాఁడు. పెండ్లికి మంగళసూత్రధారణము మానివైచి వానికంటె లోకవిరుద్ధపుఁబని నేను చేసినాను. ఈపెండ్లి యెట్లు వర్ధిల్లునో యేమో తెలియదు. ఆచింత మనకక్కఱ లేదు. అన్నిపెండ్లిండ్లు బాగుపడునా? అన్నియు భ్రష్టమగునా? వైద్యుఁడు మం రిచ్చినన్ [illegible] రోగి చచ్చుట

బ్రదుకుటఁ గూర్చి వైద్యునికిఁ జింతలేనట్లే నాకును బెండ్లిఫల మునుగూర్చి చింత యుండవలసిన పనిలేదు. కాని మంగళసూత్రిధారణముఁగూర్చియే పెద్దపొరపాటు జరిగినది. వారి కపట కునముమాట యటుంపుము. నా కమర్యాద. పౌరోహిత్యము లో నింతకంటెఁ బెద్దముచ్చ యేమున్నది? ఎవ్వరికిఁ దెలియ కుండ వారియింటికిఁ బోయి యీమంగళసూత్రము లాపిల్లమెడ లోఁ గట్టి చక్కవచ్చెదను. వారిదివటికుఁ జూచుకొని యుండ రనుకొందును. చూచుకొన్నయెడల నేడ్చుచు మొత్తుకొనుచుఁ దల్లిదండ్రులు నాయొద్దకు వచ్చియుండగా? వెంటనే పోయి యీలోపము దీర్చుకోవలయును.

(పరిక్రమించును. వెనుక తెరయెత్తఁగ—గంగ క్రిందఁ బండుకొనును.
కనకమ్మ ప్రక్కలో బిడ్డను బెట్టుకొనును. సుందరమ్మ
వేఱె యొకమంచముపైఁ బండుకొనును.)

అయ్యో! తల్లిప్రక్కలోఁ బిల్ల లేదేమి? పెండ్లివేళ దీపమే తిన్నగాఁగనఁబడలేదుగదా, పెండ్లియైనపిమ్మట దీపము మఱింత మందముగా నుండదా? పిల్ల యేమైపోయినట్లు? గంగప్రక్క లో నున్నదా యేమి? అబ్బే! అక్కడను గనఁబడదు. సుందరి ప్రక్కలో నుండునా? ఈమెప్రక్కలో నున్నట్లు కొంచెము సందేహముగానే యున్నది. ఈముందువైపునఁగాఁబోలు నెత్తు గా నున్నది. పిల్లతలయా తలగడయా? ఏమియుఁ దెలియ కుండ నున్నది. (కనకమ్మ దగ్గును.) అయ్యయ్యో! ఇఁక నాలసింపఁ దగదు. (సుందరమ్మమెడలోఁ బుస్తెలు గట్టును.) ఇక్కడకు వితంతువుమెడలో మంగళసూత్రధారణము చేయిం చితిని. ఇఁక నాకు భయములేదు. వారికర్మము—

(నిష్క్రమించును.)

ఇది పంచమాంకము.

శ్రీరామా!

# విచిత్రవివాహము.

## షష్ఠాంకము.

ప్రదేశము—పెండ్లివారియిల్లు.

ప్రవేశము—కనకమ్మ, సుందరమ్మ, వెంకటరావు, పురోహితుఁడు.

పురో—నూఱు చెప్పుఁడు లక్ష చెప్పుఁడు. ఇది దయ్యపుఁబని కాని మఱియొకటి కాదు.

వెం—పిల్లదానిమెడలో మంగళసూత్రము కట్టఁగా నేను జూచితిని.

పురో—మీరు చూచుట యేమి? వేదికలపై నాహ్వానించినముక్కోటి దేవతలు చూచినారు.

కన—సుందరమ్మకు దయ్యపుబాధ యెన్నఁడు లేదు.

పురో—నీ వట్లన కమ్మా- నాపరిపంచజ్ఞానమునుబట్టి ప్రతివితంతువును నేదో యొకదయ్య మాశ్రయించియే యుండును.

కన—అయినను వేసినముళ్లను దయ్యము విప్పి సుందరమ్మమెడలోఁ బుస్తెలు కట్టునా? ఇంతపని చేయఁగలదా?

పురో—ఇదియా- దీనితలపై నెగురఁదగిన పనులు చేయును. కొంతకంచివారింటిలోని దయ్యము పదునఱ్ఱ రెత్తలేని రుబ్బుఱోలు పైకెత్తి యావలికి విసాటిపైవ లేదా? అపరిక్కయింటిలోని

దయ్య మేమి చేసినది ? ఇంటిలోఁ బండుకొన్న వితంతువును నూరిబైటకుఁ దీసికొనిపోయి కల్లుపాకలోఁ బండుకోఁబెట్ట లేదా ? కోమటివారింటిలో దయ్యము గుడ్డలన్నియుఁ గాల్ప లేదా ?

వెం—కాని సుందరమ్మ కాబాధ యేదియు నిదివఱకు లేదు.

[illegible] నే నెఱుఁగుదును. నిన్న రాత్రి కలిగినది. దయ్యాలమఱ్ఱిక్రిందను పోయినప్పుడు సుందరమ్మపై నదివ్రాలినది. రాత్రి [illegible] దయ్యాని కైన సరే, దేవత కైన సరే పసుపు వితంతువును జూచినప్పుడు బుద్ధి రేఁగక మానదు. ఈ వాంఛ లోకమున్నకుఁ బైలోకము వారికిఁ గ్రిందిలోకము వారికి భేదము లేదు. చచ్చినవారికి బ్రదికినవారికి భేదము లేదు. నీ వప్పు డావులించితివా ?

[illegible]—ఏమే ? ఆవులించితివా ?

[illegible] పోవుటకు ముం దావులింపనా ? కనకమ్మ సూత్రి [illegible] చేయలేదా ?

వెం—ఏదో యొకటి యైనది. పిల్ల మెడలోఁ బుస్తెలు గట్టిగఁ గట్టి తివి కాదా ?

[illegible]—ఆ.

వెం—([illegible]) గొంతుకగోయ. మంగళసూత్రధారణ మైనతరువాతఁ దలఁబ్రాలఁటే ! ముందుఁ దలఁబ్రాలు పోయించితి వేమి ?

[illegible]—(అప) పంతులుగారూ ! ముందో. వెనుకయో. ఆచింత యక్కఱలేదు. జరుగవలసిన కర్మము లన్నియు జరిగినవా లేదా యనియె చూడవలెను.

వెం—ఏడువ లేకపోయినావు. ఈసంగతి యెవ్వరికిఁ దెలియఁగూడదు సుమా ?

పురో—నేను జెప్పుదుగదా !

వెం—మేముమాత్రము చెప్పుదుమా ?

పురో—త్వరగ నడువుఁడు. పెండ్లివారు వచ్చువేళ యైనది.

వెం—ఐన నిక్కడ గావలసిన దేమున్నది ?

పురో— ధరణి యీతిబాధలు లేక ♦ తనరుఁగాక
ప్రజల యన్యోన్యవైరముల్ ♦ పాయుఁగాక
కవిత రాజపోషణమునఁ ♦ గ్రాలుఁగాక
నీతిపాలనమున రాజు ♦ నెగడుఁగాక.

వెం—తథాస్తు !

(అందఱు నిష్క్రమింతురు.)

సంపూర్ణము.

